# ముఖచిత్రం

ప్రఖ్యాత యుఫిజి కళాచిత్ర ప్రదర్శనశాల ప్రపంచంలోకే అత్యంత ప్రసిద్ధమైంది.

ఫైరెంజీనగరం ప్రపంచ పటంలో ఎక్కడా గుర్తించ బడి ఉండదు. కాని ఈ నగరంలో 4,20,000 జన జీవితం ఒడ్డులు ఒరసి ప్రవహిస్తుంటుంది. ప్రపంచంలోని విహార యాత్రికులకు ఇది నయనానందకర నగరం. ఇదే ఫ్లారెన్స్. ఫ్లారెన్స్ అంటే తెలియని వారు ఉండరు. ఐరోపాకు ఆధునిక సంస్కృతికి దోహదం చేసిన బీజాలు మధ్యయుగాలలో ఈ నగరంలోనే మోసులెత్తాయి. ఇది ఇటలీ నడిబొడ్డున ఉన్నది. వాటికన్ సిటీ చర్చిలను అలంకరించిన చిత్రాలను, శిల్పాలను తయారించిన వాస్తుశిల్పి మైకలాంజిలో ఇక్కడి వాడే. పునర్వికాస ఉద్యమం ఇక్కడే ఊపిరి పోసుకొంది. మకియ వలి ఇక్కడే ప్రథమ శ్వాస తీశాడు. లీనార్డోడా విన్చీ, మైకలాంజిలో, రాపెల్‌లు ఇక్కడే తమ కళాచిత్ర అరంగేట్రం చేశారు.

ఫ్లారెన్స్‌లోని అన్ని రోడ్లు, నది ఒడ్డున ఉన్న యుఫిజి చిత్ర ప్రదర్శన శాలకే దారి తీస్తాయి. ప్రపంచంలోకే అత్యంత ప్రసిద్ధమైన అమూల్యమైన మౌలిక పెయింటింగ్స్, శిల్పాలు ఈ ప్రదర్శనశాలలోనే ఉన్నాయి. ఇక్కడ 1994లో ఒక పెద్ద బాంబు ప్రేలుడు సంభవించిగా కొన్ని కళా ఖండాలు తునాతునకలయ్యాయి. అయినా 24 గంటలలోనే మ్యూజియమ్‌ను అధికారులు వీలైనంతకు తిరిగి సర్ది, యాత్రికులకు ప్రవేశం కల్పించారు.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 10 మార్చి 1998 సంచిక 3

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాధ్ ఆలపాటి**

## విషయసూచిక




విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **యుఫిజి కళాచిత్ర ప్రదర్శనశాల - ఫ్లారెన్స్**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# ఆరోవిల్ బాన్‌ఫైర్ దృశ్యం

(నాలుగో అట్ట మీది బొమ్మ)

ఆరోవిల్ నగరం పాండిచ్చేరి సమీపంలో, శ్రీ అరవిందాశ్రమానికి అనుబంధంగా, మాత ఆశీస్సులతో, శ్రీ అరవిందుల లక్ష్యమైన మానవాళి ఐక్యతను ఈ భూమి మీద పండించుకోవడానికి ఫిబ్రవరి 28, 1968 లో ప్రారంభమైంది మానవాళి ఐక్యతను సాధించే ప్రయోగశాల ఈ నగరం ప్రముఖ భారతీయ శాస్త్రవేత్త డా స్వామినాథన్ ఆరోవిల్ స్థాపన వెనక ఉన్న భావనను వివరిస్తూ, ''మనిషి నాటినుంచి నేటివరకు ఐక్యత కోసం ఆక్రోశిస్తూనే ఉన్నాడు బెర్లిన్‌గోడ పడిపోయింది 'శీతలయుద్ధం' చలి తీరిపోయింది. అయినా కల్లోలాలు సమయలేదు సమయింప చేయడం ఎలా? మానవాళి ఐక్యతను సాధించడం ఎలా? ఈ భావనతోనే తమిళనాడులో ఆరోవిల్ నగర స్థాపన జరిగింది''.

శ్రీ అరవిందుల ఆదర్శం కర్మయోగం. దీని యథార్థీకరణ కోసం ఈ నగరం అంకితమైంది. ఈ మహాప్రయత్నం వెనుక ఉండి నడిపించిన మాత ప్రకారం, ''ఆరోవిల్ సర్వజనాళి నగరం మత, కుల, జాతి, దేశ, లింగ భేదాలకు అతీతమైంది ఆనగరం అందరూ అందులో శాంతి యుత సహజీవనం సాగించవచ్చు. ప్రగతి పథంలో ప్రగమించవచ్చు దీని ముఖ్యోద్దేశం మానవాళి ఐక్యత''

ఈ నగర లక్ష్యాల గురించి చార్టరు ఇలా చెబుతున్నది ''ప్రత్యేకంగా ఈ నగరం ఏ ఒక్కరికీ చెందింది కాదు. ప్రపంచ మానవాళి మొత్తానిది కాని ఆరోవిల్‌లో నివసించాలను కొనేవారు ''దివ్యచేతనానికి'' ఐచ్ఛిక సేవకులుగా ఉండాలి అది అంతంలేని విద్యా కేంద్రం ప్రగతి కేంద్రం. వృద్ధాప్యం లేని యువకేంద్రం. భూత వర్తమానాల కలయిక. భవిష్యత్తుకు ఆశంస. ఉత్తమ జీవితాన్ని గడపడానికి అవసరమైన పరిశోధనల ప్రయోగశాల

ఆరోవిల్ భావనను యునెస్కో 1966, 68, 70, 83 సమావేశాలలో ఏకగ్రీవంగా ఆమోదించింది అక్టోబరు 1995లో ఐక్యరాజ్యసమితి 50వ వార్షికోత్సవంలో మానవ అధివాసాలకు (Human settlements)కు ఇచ్చే బహుమతి "We the people : 50 communities"ని ఆరోవిల్‌కు ఇచ్చింది.

దీనిని మొదటి సార్వత్రిక నగరంగా తీర్చిదిద్దడానికి, సర్వగ్రహాలను ఐక్యం చేసే దిశలో పయనించే మానవ చేతనకు అర్పితమైన అన్ని జాతుల ప్రజల సంపద అయిన ఆరోవిల్‌నగరాన్ని 1966లో బుడాపెస్ట్ క్లబ్ దత్తత తీసుకొంది.

(చిత్రంలోని గ్లోబ్ ఆకృతి మాతృమందిరం)

# అంతర్లోకాలకు దారితీసే సౌందర్యమే కవిత్వం

అనువాదం : సి.ఎల్.ఎల్. జయప్రద - ఒడిస్సీస్ ఎలైటిస్

(నోబెల్ ఉపన్యాసము, డిసెంబరు 8, 1979)

ఈరోజు నేను బ్రతుకుతున్న చిన్న ప్రపంచాన్ని సృష్టించి నా వ్యాసాంగాన్ని పూర్తి చేయడానికి దోహదం చేసిన స్థితులు రెండింటి గురించి నన్ను మాట్లాడనివ్వండి అవి తేజోస్వితత్వం, పారదర్శకత్వం. అవి నాలోని భావోద్వేగంతో చేతులు కలిపి నన్ను ముందుకు నడిపిస్తున్నాయి.

కళ లెందుకు అనే ప్రశ్నకు సమాధానం చెప్పుకోవల్సి వస్తే ప్రతి మనిషికి తనదైన అనుభవాలను వ్యక్తీకరించేందుకు, తనదైన భాషలో అవి అందించేందుకు అని స్థూలంగా చెప్పుకోవచ్చు ముఖ్యంగా ఈ అశాంతి నిండిన కాలంలో కళలు విశాల దృక్పధాన్ని పెంపొందించుకునేందుకు, నేనిక్కడ చెప్పేది కళలకున్న వస్తుగుణాలను వ్యక్తీకరించే సహజమైన శక్తి గురించి కాదు ఉపమానాలకున్న రససిద్ధి గురించి, వస్తువుల సారాన్ని గ్రహించి వాటి తాత్విక లక్షణాలు బయటకు తెచ్చే శక్తి గురించి. సైక్లేడ్స్ శిల్పులు, బైజాన్‌టైన్ కళాకారులు వారి కళారూపాల్లో దైవత్వాన్ని నిలిపిన వైనం నాకు ఇప్పుడు గుర్తుకు వస్తుంది

కవిత్వం యొక్క గొప్ప వ్యాపకమేమిటంటే వాస్తవిక ప్రపంచంతో మధ్య వర్తిత్వం జరిపి దానిలోనికి చొచ్చుకు పోయి రూప పరిణామము సాధించటం వాస్తవిక స్థితిని దాటి ఆలోచించ గలగటం ఈ గమ్యం గురించి మనమెవ్వరం పెద్దగా ఆలోచించకపోవటానికి కారణం మనందరిలో ఉండే మానసిక మాంద్యతే కావచ్చు

సౌందర్యం, కాంతి పాత కాలపు విలువలై పోయాయని ఈ రోజు అనుకుంటున్నారు అంతరంగపు వీధులలో దేవదూతలను చేరే దారి, పిశాచులను చేరేదారి కంటే ఎప్పుడూ క్లిష్టతరమే ఎందుకిలా అనేది పెద్ద ప్రశ్నే. ఇది ఒక మార్మికమైన పరిస్థితి. చీకటి వెలుగులాటలోనే కాదు, పూర్తి పగటి వెలుగులో కూడా ఇది గూఢంగానే ఉంటుంది. అలా ఉండి మనను అలరించే సౌందర్యాన్ని సంతరించు కుంటుంది. మనను అంతరాంతరాల్లోకి నడిపించే సౌందర్యం, మనను మామూలు పరిధులు దాటించి, అంతర్లోకాల్లోకి దారి తీసే సౌందర్యం ఇదే కవిత్వానికి మరో నిర్వచనమనుకోవచ్చు మనకు మరోలోకపు అంచులు చూపించే కళ

విశ్వంలో ఉండే అనేక నిగూఢ సంకేతాలు - మనకు తెలియని భాషలను రచించేవి - మనను పదాలు కూర్చుమని అడుగుతుంటాయి ఈ పదాలు, వాక్యాల్లో అర్థం మనను అగాధమైన సత్యాల వాకిట నిలబెడుతుంది చివరకు ఈ సత్యాన్వేషణ మనను ఎక్కడకు తీసుకెళుతుంది? మనచుట్టూ రోజూ జరిగే అన్యాయాల్లోకి, మరణాల్లోకా లేక మనలో కలిగే సాహిత్యం నాశనం లేనిది అనే నమ్మకంలోకా? పునరుక్తం తెలివైన పని కాదని నాకు తెలుసు విశ్వసృష్టి సిద్ధాంతాలు ఒకదాని తరువాత ఒకటి పరిణామ క్రమంలో వచ్చి పునరుక్తిని మంచిగానూ చెడుగానూ కూడా వాడుకున్నాయి. ఈ సిద్ధాంతాలు ఒక దానితో ఒకటి పోటీపడి కొన్ని ఉన్నత శిఖరాల నందు కోగా మరికొన్ని కాలగర్భంలో కలసి పోయాయి.

కాని వాటిలో సారం మాత్రం నిలిచే ఉంది. ఉంటుంది

ఇకపోతే కవిత్వం - హేతు వాదం నిస్పృహతో చేతులు దించేసిన దారిలో ఇది ధీమాగా తలెత్తి నిలబడుతుంది. ఇంకాముందుకు నిషేధించిన ప్రదేశాలలోకి చొచ్చుకుపోతూ అక్రమాలకు అతీతంగా ఉంటుంది. నిర్మాణంలో పవిత్రతను సంతరించుకుని కవిత్వం సత్యాన్ని కలకాలం

---

★ **డా. జయప్రద గారు** ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంగ్లశాఖలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు

నిలబెడుతుంది. కవిత్వము, దాని పర్యవేక్షణ లేకపోతే సత్యాలు స్మృతి పథంలో సముద్రపు లోతుల్లో ఆల్గే కలిసి పోయినట్టు తమ స్పష్టతను కోల్పోతాయి

అందుకోసమే మనం స్వచ్ఛతను కోరుకునేది - శతాబ్దాలుగా భూమిపై వ్యాపించి ఉన్న ఈ చిక్కు ముడులన్నీ స్పష్టాతి స్పష్టంగా చూడటానికి. భూమి మీద మనను నిలబెట్టే ఈ చిక్కుముడులు, బంధాతా స్పష్టంగా హెర్మాక్లిటస్ నుండి ప్లేటోవరకు, ప్లేటో నుండి జీసెస్ వరకు కన్పిస్తాయి. వివిధ రకాలైన రూపాలలో వచ్చి ఇవి మనకు సూక్ష్మంగా చెప్పేదేమిటంటే ఈ ప్రపంచంలోనే మరో ప్రపంచం నిబిడీ కృతమై ఉందని, ఈ ప్రపంచపు పంచభూతాలతోనే ఆ ప్రపంచం రూపు దిద్దు కుందనీ, పైన ఉన్న ఆలోకంలో అందరూ హక్కు దారులేనని.

చైతన్యవంతమైన యుగాలలో సౌందర్యం, మంచితనంతోనూ, మంచితనం సూర్యుడి తోనూ పోల్చబడింది. అంతరంగం నిర్మలమవగలిగినంతవరకు, కాంతితో నిండగలిగినంత వరకు దానిలో చీకటి కోణాలు కూడా వెలుగుతో నిండుతాయి. ఫలితం రెండు రకాలుగా ఉంటుంది ఒకటి ఈ లోకానికి, రెండు మరోలోకానికి ఉపయోగపడుతుంది హెర్మాక్లిటస్ ఆనాడే చెప్పాడు. వైరుధ్యాలలో ఉన్న సామ్యం గురించి

మనలోని సహజ జ్ఞానాన్ని, అనుభవాల్ని మనం అపోలో, వీనస్, క్రీస్తు, వర్జిన్ లలో ఎవరి రూపంలో చూస్తాం అన్నది ముఖ్యం కాదు ముఖ్యమైందేమిటంటే మనలో సజీవంగానిలిచే ఆ అమరత్వపు అంశ. నా దృష్టిలో కవిత్వం ప్రధమంగా చెయ్యాల్సినపని ఆ అమరత్వాన్ని ఆశ్వాసింప జేయటం.

ఒలింపస్ దేవుళ్ళను, క్రీస్తునూ సమానంగా గౌరవించిన హోల్డిరిన్ కవి గురించి మనం ఇక్కడ తప్పక చెప్పుకోవాలి. ఆయన కొన్ని విలువ కట్టలేని సత్యాలు తెలియజేశారు. అదే సత్యాన్వేషణ ఆయనతో ''లేమి కాలంలో కవులేం చెయ్యగలరు?'' అనే ప్రశ్న అడిగించింది

భూలోకంలో దరిద్రం ఎప్పుడూ ఉంటూనే ఉంది. అలాగే కవిత్వానికి ఒక అర్థం ఉంటూనే ఉంది. ఇవి రెండూ భూమి మీద కలిసే ఉంటున్నాయి ఒకదానిని ఒకటి సమతుల్యం చేస్తూ సూర్యుడుండటం వలనే కదా మనకు రాత్రి, నక్షత్రాలు కన్పిస్తున్నాయి. అలనాడు ఋషులు సూర్యుడి గురించి చెప్పిన మాట ఎంత నిజం. సూర్యగోళానికి భూగోళమైనా, జ్ఞాన సూర్యుడికి మానవులైనా కొంతదూరంలో ఉంటేనే జీవించటం సాధ్యం. ఒకప్పుడు మనం అజ్ఞానం వల్ల తప్పు దారిని నడిస్తే, ఈ రోజున తెలిసిన జ్ఞానమే మనను తప్పుదారి పట్టిస్తుంది. అందరిలా సాంకేతిక నాగరికతను విమర్శించాలని ఈ రోజు నేనీ మాటలనటం లేదు. నాదేశమంత ప్రాచీనం అయిన వివేకం నన్ను పరిణామక్రమాన్ని తొక్కలు, గింజలతో సహా జీర్ణించుకోమని చెప్పింది.

మరి అలాంటి దేశంలో కవిత్వం ఏం చెప్తుంది? ఏం చేస్తుంది? నా సమాధానం ఇదే! ఒక కవిత్వానికి మాత్రమే సంఖ్యా బలాన్ని చీగి పోయేట్లు చేసే శక్తి ఉంది. ఇంత చిన్న దేశానికి చెందిన నన్ను ఈ రోజు నోబెల్ బహుమతితో గౌరవిస్తున్నారంటే ఈ నిర్ణయం వెనుక ఆయాచితంగా కళలను గౌరవించే భావన, దాని వెనకగల సమతుల్య భావాలు, కవిత్వానికి సంఖ్యా బలాన్ని ఎదిర్చే శక్తి ఉండటం కారణం.

ప్రియ స్నేహితులారా! నేను కేవలం కొద్ది లక్షలమంది మాట్లాడే భాషలోనే రాశాను. కాకపోతే ఈ భాష మధ్యలో ఏ ఆటంకాలు లేకుండా, ఏపెద్ద మార్పులు లేకుండా రెండు వేల ఐదు వందల సంవత్సరాలనుండి మాట్లాడుతున్నారు. ఈ స్థల కాల ప్రభావం నాదేశం నాగరికత పైన స్పష్టంగా కన్పిస్తుంది. స్థలపరంగా చూస్తే దీని ప్రభావం తక్కువ. కాలపరంగా చూస్తే ఎక్కువ. ఈ

విషయాన్ని నేను గర్వంగా చెప్పు కోవటం లేదు. ఒక కవి పిండార్రో, సోఫోనో రాసిన భాషలో కవిత్వం రాస్తూ ఒకనాటి పాఠకులు ఈ రోజు లేరని, తన పాఠకులు నాగరిక ప్రపంచమంతా ఉండవచ్చునే భావనతో రాయటం ఎంత కష్టమో చెప్పటం కోసం చెప్తున్నాను.

భాష అనేది సంభాషణకు ఒక వాహిక మాత్రమే కాక ఒక్కోసారి ఇంద్రజాలాన్ని చూపించే దర్పణం కూడా అవుతుంది పైగా కొన్ని శతాబ్దాల తర్వాత కొన్ని గుణాలను సంతరించుకుని ఇది ఒక శ్రేష్టమైన భాషగా మారుతుంది. ఆ లక్షణంతో పాటు కొన్ని బాధ్యతలు కూడా పెరుగుతాయి. ఇరవై ఐదు శతాబ్దాలుగా గ్రీకులో కవిత్వం రాస్తూనే ఉన్నారు ఆపరిస్థితులే గ్రీకు భాషపై సాంప్రదాయం అనే బరువైన బాధ్యత పెట్టాయి ఆధునిక గ్రీకు కవిత్వం ఆ అంశాలని సదృశ్యంగా మనకళ్ళ ముందుంచుతుంది.

ఈ కవిత్వపు గోళంలో కూడా రెండు ధృవాలు ఉన్నాయి. ఒక దానిలో డయనీసి మోస్ సోలోమోన్ ఉన్నారు. ఆయన ఐరోపా సాహిత్యంలో మల్లార్మే కంటే ముందుదయించి చాలా స్పష్టంగా నిర్మలమైన కవిత్వం గురించి విశదపరిచారు. మార్మికత దారిలో తెలివికి భావోద్రేకాలని లోబరిచి, భావ వ్యక్తీ కరణను ఉన్నత పరచి భాషకున్న శక్తినంతా క్రోడీకరించారు ఇంకొకధృవంలో కవాఫిస్ ఉన్నారు.. ఈయన టి. ఎస్. ఎలియట్ లాగా అలంకారాలన్నీ త్యజించి అతి సంక్షిప్తంగా, క్లుప్తంగా రాయటం సాధించారు ఈ రెండు ధృవాల మధ్య అటు ఇటూ కదులుతూ మరెందరో కవులు కాస్టిస్ పలమాస్, సిక్కాలియవ్స్, నికుస్ కజాన్ట్జకిస్, జార్జిస్ సెఫరిస్

గ్రీకు కవిత్వంలో ఇవి కొన్ని స్థూలమైన పరిణామాలు. ఉన్నతమైన ఆనాటి పరిణామాలు నిలబెట్టడం, సమకాలీన పరిస్థితుల కనుగుణంగా రాయటం ఈ నాటి మా బాధ్యత శిల్ప నియమాల పరిధులు దాటింతరువాత గ్రీకు సాంప్రదాయాన్ని ఒక ప్రక్క, సమకాలీన ప్రపంచంలో సాంఘిక, మనో విజ్ఞాన అంశాలు మరో ప్రక్క, జీర్ణించుకుని సంయోగించుకుంటూ ఉండాలి ఈ నాటి గ్రీకుల, యూరోపియన్ల యదార్థ ప్రపంచాల్ని సాహిత్యం ప్రతిబింబింప జెయ్యాలి.

కళాకారుణ్ణి చంపేసే పరిస్థితులు ఈ రోజుల్లో బలంగా ఉండగా సృజనాత్మకతను పై విధంగా పెంచుకునే అవకాశాలు ఏవి? వివిధ రకాలైన భాషలు ఆటంకాలవుతుండుగా ఒకే సంస్కృతికి సంబంధించిన సంఘం ఎలా జనిస్తుంది? మనం ఒకరికి ఒకరు తెలిసేది రచనలో ఇరవై ముప్పైశాతం అనువాదంలో పోయిం తరువాత మాత్రమే ఇది భాషలో ఒక ఇంద్రజాలశక్తి ఉందని నమ్మే కవుల విషయంలో మరీ నిజం. ఒకే భాష లేకపోవటం కవులకే కాదు ఐరోపాలో సాంఘిక, రాజకీయ అంశాలకు కూడా ఒక లోటుగానే ఉంది.

మనం తరచు వింటూనే ఉంటాం ''ప్రస్తుతం మనం ఒకలాటి అరాచక స్థితిలో బ్రతుకు తున్నాం'' అని, మన భౌతికా వసరాలు ఈ రోజు ఎంతగాతీరుతున్నాయో విలువలు అంతగా లోపిస్తున్నాయి. ఒక కవికి ఇందులో వైరుధ్యం కన్పించ వచ్చుకాని విలువలని వ్యక్తీకరించే సామూహిక భాష ఇంతవరకు మనకు ఏర్పడలేదు. ఒక్క ఇంద్రియాను భూతులను వ్యక్తీకరించటంలోనే కవి అందరికీ సంబంధించిన భాష వాడగలడు. శతాబ్దాలుగా రెండు శరీరాలు ఒక దాని నొకటి ఆకర్షించే పద్ధతి, స్పృశించే పద్ధతి మారలేదు. అది అర్థం లేని సిద్ధాంతాల లాగా, రకరకాల వాదాల లాగా ఏ సమాజంలోనూ కల్లోలం సృష్టించలేదు. ఇంద్రియ జ్ఞానం గురించి చెప్పేప్పుడు నేను తాత్కాలికమైన వాటి గూర్చి మాట్లాడం లేదు. మనను మన అనుభూతుల అంచులకు తీసుకెళ్లే జ్ఞానం గురించి మాట్లాడుతున్నాను. మన మనసులలో ఆత్మలలో తారాడే ఇంద్రియాను భూతులకు సాదృశ్యమైన అనుభవాల గురించి చెప్తున్నాను.

కళలన్నీ సాదృశ్యమైన విషయాల ద్వారానే మాట్లాడతాయి నిలువులైనా, వంకరలైనా గీతలు, చురుకులైనా, భారమైనవైనా శబ్దాలు, దృశ్యపరమైనా, శబ్దపరమైనా అనుభూతులను అనువాదం చేస్తాయి కవులు ఎవరి పరిధుల్లో వారు మంచివో, పిచ్చివో కవితలు రాస్తుంటారు హోమర్ ఊహించిన సముద్రపు చిత్రం మనకు ఈరోజుకీ అలాగే కన్పిస్తుంది రింబాడ్ 'సూర్య కాంతిలో తేనెలొలుకు సముద్రం' అంటూ 'అది అనంతమైనది' అన్నాడు మాటిస్సే చిత్రంలో ఒక కదంబపు రెమ్మ పట్టుకున్న యువతి ఈ రోజుకీ జీవకళ ఉట్టిపడుతూనే ఉంది. బైజాన్‌టైన్ కళలో కన్నె మరియ చిత్రం కొంతమంది అపవిత్రమైన స్త్రీలకు రూపు రేఖలలో పూర్తిగా భిన్నంగా ఉన్నదా అన్నది ప్రశ్నే? కళలలో మామూలు విషయాల్ని లోకాతీత కాంతితో ప్రజ్వలింప జేయటానికి కానీ దానికి వ్యతిరేకంగా చూపటానికి కానీ చాలా కొద్ది వస్తువులే అవసరం. ప్రాచీన యుగాలనుండి, మధ్య యుగాలనుండి మనకు వచ్చిన అనుభూతులకు ఈ తరంలో పుట్టిన అనుభూతులకు - తల్లిదండ్రులకు బిడ్డలకు ఉన్నంత తేడా ఉంది కవిత్వం ఆదారిలో వెళ్ళగలదా! నిరంతరంగా కవిత్వంలో నిర్మలత్వాన్ని సంతరించుకునే ఇంద్రాయాను భూతులు ఒక పవిత్రమైన స్థితిని చేరుకోగలవా? సాదృశ్యమైన విషయాలు తిరిగి వచ్చి, భౌతిక ప్రపంచంలో నిలదొక్కుకుని దానిపై ప్రభావం చూపగలదనే నానమ్మకం

మన కలలని కవిత్వంలో చూపటంతో సరిపోదు భౌతిక ప్రపంచం ఒక పదార్థాలకూటమి మాత్రమే. కవి బాధ్యత మంచో చెడో వాస్తు శిల్పిగా భూమిపైన స్వర్గాన్నో,నరకాన్నో నిర్మించటం. అదే కవిత్వాన్ని జీవింప జేసేది. మన భవిష్యత్తును నిర్ణయించేది.

సారతత్త్వ విచారానికి కళలకు ఉన్న సంబంధం గురించి నేనివ్వాళ చెప్ప బోవటం లేదు ఒక సత్యం మాత్రం చెప్పాలి. గ్రీకుల భాష ఒక మంత్రదండంలా సూర్యునితో ఆంతరంగికమైన బంధాన్ని నిలుపు కుంటుంది. వాస్తవిక రూపంలో మరియు ప్రతీకతో, సూర్యుడు ఒక విధమైన జీవన ధృక్పధాన్ని ఉత్తేజ పరచటమే కాకుండా వారి కవితలలో ప్రధానమైన అర్థంగా కూడా ఉన్నాడు గ్రీకు కవితా శిల్పంలోకి కూడా ఇది చొచ్చుకు పోతుంది.

మనం శుద్ధమైన శిల్పం వైపుగా పయనిస్తున్నామను కోవటం పొరపాటు. పాశ్చాత్య దేశాలలో మనము చూస్తున్న కవితా రూపం రెండు మూడు మోడల్స్ కలియక. ఈ రెండు మూడు మూసలలో ఏ వస్తువునైనా కుదించగలగాలి ఈ సంకెళ్ళని మొదటి సారి విరగ్గొట్టిన వాణ్ణి నేను.

నన్ను మొదట్లో అస్పష్టంగా తర్వాత స్పష్టంగా ఆకర్షించిన విషయం - వస్తువులను ప్రతిసారీ ఒక కొత్త శిల్పంలో బిగించటం. మన చుట్టూ సైషెడ్స్‌లో ఇళ్ళు కట్టే మేస్త్రీలను చూసి కళాకారులు నేర్చుకోవాల్సినది ఉంది. అది సమస్య లెదురయిన ప్రతిసారీ వారు అనుభవంతోనూ అందం గానూ చిక్కు ముడులు విడదీసుకుని ముందుకు పోయే పద్ధతి. 'ఆక్సియన్ ఏస్తి' లాంటి పెద్ద కవిత రాసేప్పుడు నేను వారి నేర్పరితనాన్నే గుర్తుకు తెచ్చుకున్నాను. కొలతలు, సమతరాలు లేక పోతే కట్టడం లాగా కవితకు కూడా నేనివ్వదలుచుకున్న రూపం వచ్చేది కాదు.

మరి కవిత తనచుట్టూ ఉన్న అన్ని అంశాలను తనలోకి ఆకర్షిస్తూ ఒక చిన్న సూర్యుడిలా మార్పు చెందుతున్నదన్నది నిజం కాదా? నా దృష్టిలో కవికి గొప్ప ఆశయం - వస్తువుకి, శిల్పానికి సంపూర్ణమైన సామ్యం సాధించటమే మండే సూర్యుణ్ణి దోసిళ్ళలో పట్టుకుని దానిని వెలిగే దివిటీలా మార్చటం కవికి బాధాకరమైనదీ, భగవత్ ప్రసాదితమైనదీ అయిన బాధ్యత. మనకది అవసరం. ఒకరోజు మానవుల్ని బంధించి ఉంచే పిడివాదాలు కరిగి పోయి, మానవ చైతన్యం వెలుగుతో నింపబడి సూర్యుడితో ఒకడై మానవోత్తమ ఆశయాలైన స్వేచ్ఛ, గౌరవాలనే తీరాలను తప్పక చేరుతుంది.

# చలం సావిత్రి - మనోవిశ్లేషణ

- డా. కరెవరపు వెంకట్రామయ్య

1.0 మనో విశ్లేషణ సిద్ధాంత (PSYCHO-ANALYSIS) కర్త సిగ్మండ్ ఫ్రాయిడ్ (1836-1939) ఫ్రాయిడ్ విశ్లేషణ ప్రకారం వ్యక్తి మూర్తిమత్వ (PERSONALITY) నిర్మాణంలో ప్రధానాంశాలు మూడు అవి 1 ఇడ్ (ID) 2 ఈగో (EGO) 3 సూపర్ ఈగో (SUPER EGO) ఈగోలో కొంతభాగం 'చేతనం' (CONSCIOUSNESS) మరికొంతభాగం 'అచేతనం' (UNCONSCIOUS). చేతనభాగం పరిసరంతో సంబంధం పెట్టుకుంటుంది అచేతన భాగానికి అటువంటి సంబంధం ఉండదు ఈ అచేతన భాగాన్నే ఫ్రాయిడ్ 'ఇడ్' అన్నాడు 'ఇడ్' ని సరుకులు నిలవవేసే ఒక కొట్టు (STORE ROOM) గా భావించవచ్చు దీనిలో ఉండే సరుకులు వ్యక్తి ఉనికికి సంబంధించిన సహజాతాలు అంటే జీవ, మరణ సహజాతాలు (INSTINCTS OF LIFE AND DEATH) జీవసంబంధమైన ప్రేరకాలు, ఆప్రేరకాలను తృప్తిపరచే సహజాత ప్రతిచర్యలు - మనోవిశ్లేషణ సిద్ధాంతం ప్రకారం ముఖ్యమైన ప్రేరకాలు లేదా 'సహజాత ఉత్సుకతలు' (INSTINCTIVE DRIVES) వినాశకర ప్రోత్సాహకాలు కూడా ఇందులో చోటుచేసుకుంటాయి ఈ ప్రేరకాల శక్తిని 'లిబిడో' (LIBIDO) అంటారు ఇడ్ శక్తిని లేదా లిబిడోని దాని మానానికి దాన్ని వదలివేస్తే అది ముఖ్య ప్రేరకాలను సంతృప్తి పరుస్తుంది అయితే అట్లా సంతృప్తి పరచడంలో దానికి జీవిత సత్యాలతోను, నీతి నియమాలతోను పనిలేదు

ఇడ్‌లోని సహజాతశక్తులు పరిసరంతో సంబంధం కోసం ప్రత్యేక వాంఛల రూపంలో బయలు వెడలి చేతన జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. ఈ ప్రత్యేకవాంఛలు ఒక్కొక్కప్పుడు ప్రపంచానికి అనుగుణంగా ఉండవు అటువంటప్పుడు 'ఈగో' ఆవాంఛలను వెనక్కి నెట్టివేస్తుంది. అప్పుడవి ఇడ్‌ని తిరిగి చేరతాయి ఇడ్ - ప్రపంచాల మధ్య ఈగో మధ్యవర్తిగా వ్యవహరిస్తుంటుంది. ఇడ్‌కి తన సుఖం తప్ప రెండో విషయం పట్టదు ఇది తన సుఖంకోసం (గుడ్డిగా) 'సుఖసూత్రాని' (PLEASURE PRINCIPLE) కి అనుగుణంగా చరిస్తుంది కానీ ఇడ్ ఏంచేసినా ఈగో ద్వారానే చేయవలసి ఉంటుంది. ఎందుకంటే ఈగోకి మాత్రమే బాహ్యప్రపంచం (పరిసరం) తో సంబంధం ఉంటుంది

ఇడ్, ఈగోల మధ్య తగవు ప్రతిమనిషిలోని బర్బర, నాగరికతల మధ్య ఉన్న తగవే! కానీ ఫ్రాయిడ్ ప్రకారం ఈరెంటి మధ్య న్యాయనిర్ణేత (Judge) గా వ్యవహరించే వేరొక భాగం మనిషి మనోక్షేత్రంలో ఉంది అది ఈగోలో భాగం. దీన్నే 'సూపర్-ఈగో' అంటారు ఇది దాదాపు మన అంతరాత్మకు సరిపోతుంది. ఇదిగురువుగా, తండ్రిగా, అధికారిగా, న్యాయనిర్ణేతగా వ్యవహరిస్తుంది. ఇది ఈగో, ఇడ్‌ల మీద ఆంక్షలు విధిస్తుంది. దీనిలో విధి నిషేధాలు - ఇది చేయి, అది చేయవద్దు - ఉంటాయి.

మనో రోగుల బాధా నివారణార్థం ఫ్రాయిడ్ పరిశోధనా పూర్వకంగా చేసిన ఈవిశ్లేషణ క్రమేపి సాహిత్య, తదితర కళారంగాలలోకి కూడా చొరబారింది. రచయిత మనో సంబంధ సృజనాత్మక వ్యాపారమే రచన. ఈదృష్ట్యా ఒకరచనలోని పాత్రల్ని సృష్టించటంలో రచయిత మనోస్థితిగతుల్ని, ఉద్దేశాలను, అతని సృష్టిలోని పాత్రల ప్రవర్తనా తీరుతెన్నుల్లోని మానసికాంశాల్ని ఈ మనోవిశ్లేషణ సిద్ధాంత నేపథ్యంలో విమర్శకులు పరిశీలించటం ప్రారంభించారు. కాగా

---

★ **డా. కరెవరపు వెంకట్రామయ్య,** మిసెస్ ఎ.వి యస్ కళాశాల, విశాఖపట్టణంలో తెలుగు శాఖలో పనిచేస్తున్నారు

రచయితలు మరో అడుగు ముందుకువేసి మనోవిశ్లేషణ సిద్ధాంత నేపథ్యంతో ఏకంగా పాత్రల్నే సృష్టించారు. రచనలు చేశారు ఎన్నో నూతన ప్రయోగాలకు నాంది పలికారు. ఏతత్కారణంగా ఆధునిక సాహిత్య విమర్శలో 'మనోవిశ్లేషణాత్మక సిద్ధాంత విమర్శ' (PSYCHO ANALYTICAL CRITICISM) ఒకబలమైన విధానంగా వేరూనుకుంది ఈనేపథ్యంలో చలం 'సావిత్రి' నాటకంలోని సావిత్రి పాత్రపరిశీలనయే ప్రస్తుత వ్యాసోద్దేశం.

1·1 'మేటర్లింక్ రాసిన నాటకం ఆధారంగా' చలం 1924లో రచించిన నాటిక సావిత్రి. ఇది చలం ఉద్దేశించిన 'మహాప్రేమ' విలువను ప్రతిపాదిస్తోంది. మానవతావిలువలలో అత్యంత ముఖ్యమైంది ప్రేమ చలం సావిత్రి నాటిక - ప్రేమను కేవలం ఇరువురు వ్యక్తుల మధ్య ఆకర్షణగానో, పరస్పరస్వార్థ సహాయ సహకారాలగానో చూడరాదని చాటుతోంది. స్వార్థరహితమై తనను తాను అర్పించుకోవడంలో, తనను తాను ఇతరుల కోసం పోగొట్టుకోవడంలో, ఇతరులతో ఐక్యం చెందడంలో, పరిమితులు, అవధులు లేని అర్పణంలో 'మహాప్రేమ' నిబిడీకృతమై ఉంటుందని ప్రబోధిస్తోంది. ఇదీ చలం సావిత్రి వైశిష్ట్యం

1 2 భారతం అరణ్య పర్వంలో 'సావిత్ర్యుపాఖ్యానం' ఉంది. సావిత్రి ఆదర్శనారీతత్వాన్నీ, పరమ పతివ్రతా మాహాత్మ్యాన్ని నిరూపించే ఉపాఖ్యానం అది. పౌరాణిక విలువలకు సంకేతం భారత సావిత్రి ఆధునిక యుగంలో - జాతీయోద్యమంలో భాగంగా - అరవిందులు - ఆంగ్లమహాకవి మిల్టన్ 'పేరడైజ్ లాస్ట్ {(Paradise lost)', 'పేరడైజ్ రిగైన్డ్ (PARADISE REGAINED)' కి ప్రతిద్వంద్విగా మహా ఐతిహాసిక (GREAT EPIC) ప్రతిపత్తితో 'సావిత్రి' బృహత్కావ్యాన్ని సృష్టించారు. భారతీయ వేదాంత సారానికీ, తాత్త్విక గాఢతకూ, మార్మిక వాద (MYSTICISM) నిబద్ధతకూ, భారతీయ చింతనా వైశిష్ట్యానికీ అద్దం పట్టింది అరవిందుల అమరకావ్యం సావిత్రి. ఇంచుమించు అరవిందుల సావిత్రికి సమకాలంలో చలం కలం నుంచి వెలువడిన సంక్షిప్త రచన సావిత్రి నాటిక. ఈ మూడింటిలోనూ కథా గమ్యం ఒకటే! మరణించిన భర్తను పునరుజీవితుణ్ణి చేసికోవటం. అయితే కథా కథనం (NARRATION) లో ఎవరి పద్ధతి వారిదే. మద్ర దేశాధిపతి అశ్వపతి. అతని కుమార్తె సావిత్రి సాళ్వదేశాధిపతి ద్యుమత్సేనుడు. అతని కుమారుడు సత్యవంతుడు. సావిత్రీ సత్య వంతులకు వివాహ మౌతుంది. ఖచ్చితంగా వివాహమైన సంవత్సరానికి సత్యవంతునికి మరణం ప్రాప్తిస్తుందనేది విధి నియమం. ఆ నియమానుసారం సత్యవంతుని ప్రాణాన్ని యముడు పట్టుకెళ్తుంటే; సావిత్రి తన పాతివ్రత్య మహిమతో ఆ యముని వెన్నంటి, అతడ్ని మెప్పించి, భర్త ప్రాణాల్ని వరంగా పొంది- సత్యవంతుణ్ని పునరుజ్జీవితుణ్ని చేసికొంటుంది. ఇదీ పౌరాణిక కథనం. చలం వివాహ వ్యవస్థకి వ్యతిరేకి కాడు. దానిలోని అక్రమానికి వ్యతిరేకి. సాంప్రదాయకంగా భారతీయ సమాజం పాతివ్రత్యం పేరుతో స్త్రీని అణగదొక్కిన విధానానికి వ్యతిరేకి. మనసులేని, వ్యక్తిత్వం లేని మరబొమ్మగా స్త్రీని మార్చిన పురుషాహంకారానికి వ్యతిరేకి. తరతరాలుగా పాతుకొనిపోయి, ఘనీభవించి జడప్రాయమైన విలువల్ని ఖండించటానికీ, రోగగ్రస్థమైన సమాజశరీరానికి తన రచనల ద్వారా 'షాక్‌ట్రీట్‌మెంట్' ఇచ్చి తిరిగి చైతన్యవంతం చేయటానికి ప్రయత్నించిన పరమభావుకుడు, అపూర్వ సంవేదనాశీలి - చలం. ఆ పౌరాణిక సావిత్రి కథనే గ్రహించి-మానసికంగా స్త్రీల ఆలోచనలో రావలసిన చైతన్యాన్ని, అలవరచుకోవలసిన చొరవను, ప్రదర్శించవలసిన తెగింపును నిర్దేశిస్తూ మూలకథలో కొన్ని మార్పులు చేసి సావిత్రి నాటికను చలం దిద్దితీర్చాడు. మూలంలో తండ్రి అనుమతితో,

సంప్రదాయబద్ధంగా సావిత్రి సత్యవంతుణ్ని వివాహమాడుతుంది కానీ చలం సావిత్రి తండ్రిని ఎదిరించి, అతనికి తెలియకుండా సత్యవంతుడితో వెళ్ళిపోతుంది భర్తగా సత్యవంతుడు తనను పొందితే అతడు మరణిస్తాడని తెలిసినా 'ఆ అనుభవానికి' వెనకడుగు వేయదు సత్యవంతుడి ప్రాణాల్ని గ్రహించటానికి వచ్చిన యముడితో తన ప్రాణాల్ని పణంగా పెట్టి పందెం వేస్తుంది సావిత్రి ప్రేమను పరీక్షించటానికి యముడు సత్యవంతుడు చంద్రిక అనే పరాయి స్త్రీతో సన్నిహితంగా ఉన్నట్లూ, అతడామెను ముద్దుపెట్టుకున్నట్లు ఒక కల్పితసన్నివేశాన్ని చూపుతాడు. సావిత్రి విస్తుపోతుంది. వితర్కించుకుంటుంది. సత్యవంతుణ్ని క్షమిస్తుంది సత్యవంతుణ్ని బ్రతికించటానికి ఒకసారి తనకు వశం కావాలన్న యముని కోరికను నిరాకరిస్తుంది. భర్తను బ్రతికించుకోటానికి యముని కోరికను తీర్చటం మినహా గత్యంతరం లేని స్థితిలో ఆ యముణ్ణో చంపటానికి కూడా వెనుదీయదు. చివరకు యముని మెప్పును పొందుతుంది భర్తను బతికించుకుంటుంది. చలం మూలకథకు కల్పించిన ప్రతిమార్పు అతడు ప్రబోధింప తలపెట్టిన భావాలకు అనుగుణమైందే!

1:3 ఒక ప్రధానపాత్ర, దానిచుట్టూ మిగిలిన పాత్రలు, సన్నివేశాలు, సంఘటనలు కల్పించటం- అంటే వ్యక్తి పరంగా కుటుంబాన్ని, సంఘాన్నీ చిత్రించటంలో- మనస్తత్వ సిద్ధాంత ప్రధానమైన రచనల్లో కనిపించే విశిష్ట లక్షణం చలం సావిత్రి నాటకంలో సావిత్రి ప్రధానపాత్ర నాటికకు కేంద్ర బిందువు ఈ పాత్ర చుట్టే మిగిలిన పాత్రలన్నీ తిరుగుతాయి. నాటక సంఘటనల్ని నిర్దేశించేది ఈ పాత్రే. ఫ్రాయిడ్, అతని అనుయాయులు ప్రతిపాదించిన మనోవిశ్లేషణ సిద్ధాంతాంశాలు సావిత్రిలో పుష్కలంగా కనిపిస్తాయి పౌరాణిక సావిత్రి కంటే చలం చిత్రించిన సావిత్రిపాత్ర భిన్నం ఆలోచనలో, ఆచరణలో ఆధునికత నిండుగా మూర్తీభవించిన పాత్ర అందువల్ల ఆధునిక సిద్ధాంత నికషోఫలం మీద సావిత్రి పాత్ర నిగ్గును నిర్ధారించవచ్చు.

1 4 సావిత్రి పాత్రలో ఇడ్ బలవత్తరమైంది అందువల్లే సత్యవంతుడు కనిపించిన మొదటిక్షణంలోనే-వేరేమీ ఆలోచించకుండా అతనిపట్ల ఆకర్షితురాలవుతుంది ఆమెలోని 'లైంగిక సహజాతం' (Sexual Instinct) దీనికి ప్రేరణ సత్యవంతుడు అల్పాయుష్కుడని తండ్రి చెప్పినా, తనపట్ల విధేయత కలిగి ఉండటం కనీస కర్తవ్యమని జ్ఞప్తికి తెచ్చినా పట్టించుకోదు. ''నా ఆనందమూ, ఇతని ఆనందమూ, నన్ను ప్రేమించే అందరి ఆనందమూ, నా కళ్ళముందు శాశ్వతంగా నశించినా సరే, యితని దగ్గర్నించి దూరంకాను'' (సావిత్రి. పు.8) - రాబోయే పరిణామాన్ని లెక్కచేయకుండా తండ్రితో సావిత్రి దృఢచిత్తంతో అన్నమాటలివి. పరిణామాలను పరిగణించని వాంఛా సఫలతే ఇడ్ ధ్యేయం.

1:5 సావిత్రి సాధ్యాసాధ్యాలను ఆలోచించకుండా, యముడితో పందెం వేయటానికి కారణం కూడా ఈ ఇడ్ బలవత్తరమైంది కావటమే! ఆమెలో ఆధిక్యతకోసం పాకులాడే మనస్తత్వం **(Striving for superiority)** ఉంది. తాను పట్టిన కుందేలుకు మూడేకాళ్ళనే మనస్తత్వం ఆమెది. ఈ ఆధిక్యం కోసం పాకులాడే మనస్తత్వం వల్ల 'ఆధిక్యతాభావం' **(Superiority Complex)** ఏర్పడుతుంది. తండ్రిని ఎదిరించటంలోను, సత్యవంతుడే నాభర్త అని నిర్ద్వంద్వంగా ప్రకటించటంలోను ఈ లక్షణం ద్యోతక మౌతోంది.

1:6 సత్యవంతుడు సావిత్రిని భర్తగా తాకితే మృతి చెందుతాడనీ; సావిత్రికి వైధవ్యం ప్రాప్తిస్తుందనీ అశ్వపతి హెచ్చరిస్తాడు. అయినా-వైవాహిక కార్యక్రమ తంతు జరగకుండానే-కేవలం

రెండు హృదయాల కలయికనే వివాహంగా భావిస్తుంది సావిత్రి. అందుకే ''వివాహం యిదివరకే అయింది. మరణమే మిగిలింది'' (పు.8) అని ఖండితంగా చెబుతుంది. ఇలా చెప్పటంలో ఆమె 'అంతరాత్మ' (Conscience) కు విలువ ఇచ్చిందని స్పష్టమౌతోంది దీన్నిబట్టి యూంగ్(Jung) చెప్పిన ' ఇంట్రోవర్ట్' (Introvert) లక్షణం సావిత్రిలో ఉందని చెప్పుకోవచ్చు. అంటే అంతర్గత భావాలకు ప్రాధాన్యమిచ్చే 'అంతర్వర్తిని' అన్నమాట.

1:7 తండ్రి ఖైదు చేసిన సత్యవంతుణ్ని విడిపించటానికి సావిత్రే స్వయంగా వెళుతుంది. పొరపాటున దొరికితే తండ్రి శిక్షిస్తాడు. అయినా భయపడదు అలాగే తనతో అనుభవాన్ని పంచుకున్న భర్త(గా) సత్యవంతుడు మరణించినప్పుడు కూడా సావిత్రిలో ధైర్యం వీగిపోలేదు. తానుగాఢంగా ప్రేమించే సత్యవంతుణ్ని తననుంచి ఎవరూ వేరుచేయలేరని నిశ్చయంగా అంటుంది. తన అచంచలమైన ప్రేమతో అతనిలో ప్రాణప్రతిష్ఠ చేయటానికి నిశ్చయించు కుంటుంది.

''భయం లేదు. నా హృదయావేశం, జీవనరక్తం నీలో ప్రవేశపెడితాను.. . భయమెందుకు? నేను ప్రేమించే నిన్ను యెవరు తీసుకుపోతారు? యేడులోకాలు దాటించి తప్పించనీ, పధ్నాలుగు సముద్రాల కింద దాచనీ, నిన్ను మళ్ళీ తెచ్చుకుంటాను. సమస్త జీవనోద్రేకాన్ని వెలిగించే ప్రేమ జ్వాలలతో నీ శరీరానికి కాంతినిస్తాను. నా కొనవూపిరితో నైనాసరే నీలో ప్రాణం ప్రతిష్టిస్తాను, భయపడకేం? ఆశ వదలకు!.... '' (పు.14).

తన ప్రేమాలింగనంలో ఉండగా సత్యవంతుడిని మృత్యువుకూడా సమీపించలేదని సావిత్రి అకుంఠిత విశ్వాసం.

''రానీ మృత్యువుని; కనురెప్ప వాల్చక యిక్కడ కావిలివున్న ప్రేమాగ్నిని చూసి, భయపడదేమో! దగ్గరికి వొస్తే రెక్కలు కాలవూ? సమస్త ప్రపంచాల్నీ కాల్చే ప్రళయరుద్రులు వొస్తేనేం గాక నిన్నెదుర్కొని, చల్లబడి, నీరై, ప్రణయదేవత పాదప్రక్షాళనము చేస్తారు....నా సత్యవంతుడు మృతి చెందుతాడా? నా దగ్గిర్నించి మాయమవుతాడా? లేదు, వీల్లేదు, నేను మృతి పొందనీను.... ఛీ, ప్రేమకి మృత్యువేమిటి? అనురాగబంధానికే అంతముంటే నా హృదయంలో జ్వలించే ఈగాఢమైన ఆవేశానికి అర్థమేమిటి?... యిది మృత్యువే అయిన, సమస్త జీవనాధారమైన ప్రణయాన్ని నిగ్గుతీసి, కేంద్రీకరింపజేసి, మృత్యువునే, నవజీవనం తాగించి హాలాహలాన్ని అమృతంగా మారుస్తాను.'' (పు.14,15)

ఈ మాటలు సావిత్రి దృఢ సంకల్పానికి సూచికలు అడ్లర్ (Adler) చెప్పిన 'జీవనశైలి' (Style of Life) సావిత్రిలో ఉంది.

1·8 సత్యవంతుడు చంద్రికను ముద్దుపెట్టుకోవటం చూసినప్పుడు సావిత్రిలో ' ఈగో' తలెత్తింది. ఆమె బాధతో కేకవేస్తుంది. దీనికి కారణం ఆమెలోని 'పొసెసివ్ ఇన్‌స్టింక్ట్' (Possisive Instinct). ఆమెలోని ఈగోవల్ల - తనను నిజంగా ప్రేమిస్తే సత్యవంతుడు ఆపని చేయడు కదా! అని సందేహిస్తుంది. అందువల్లే ''నీకు ప్రేమా ఆమె మీద?'' (పు.20) అంటుంది. కానీ అంతలో ఇడ్ ప్రభావంవల్ల ఈగో అణగిపోయి సత్యవంతుణ్ని క్షమిస్తుంది. ఇక్కడ సావిత్రిలో 'ఉదాసీనత' (Apathy) లేశమాత్రంగా కనిపిస్తోంది. పశ్చాత్తప్తుడై వచ్చిన సత్యవంతుడితో తను జరిగిన విషయాన్ని అప్పుడే మరచిపోయినట్లు చెబుతుంది. ''నిన్నే! నిన్ను తప్ప దేన్నీ కాదు. నువ్వు యెట్లా వుంటేనేం, యేం చేస్తేనేం. యేమయితేనేం నువ్వేగా!... యెట్లా చెప్పను?. . ప్రేమలో మునిగిగుడ్డిదాన్నీ, చెవిటిదాన్నీ అయినాను..... నువ్వు యేం చేస్తావో, ఏం మాట్లాడతావో, ఎటువంటి వాడవో, ఇదేం కాదు నేను ప్రేమించేది. నిన్ను! నిన్నే! ఏ మార్పురాని ఏమార్పురావడం

అసంభవమైన నిన్ను! యీ మార్పుకు అతీతమైన నిన్ను, యెవరిని నీపనులు, మాటలు, స్వభావము, అంటదో ఆ నిన్నూ నేను ప్రేమించేది నేను ప్రేమించే సత్యవంతుడు కాదు నాకు ద్రోహం చేసింది. చెయ్యడం అసంభవం'' . (పు 26,27)

... ప్రేమలో అధర్మం వీలులేదు సత్యవంతుడు యిట్లాంటి ద్రోహి అయితే నేను మొదలు ప్రేమించి వుండను (పు.27)

''సమయాన్ని బట్టి ఔన్నత్యం పొందని ప్రేమ! ప్రేమా?'' (పు 25) మనం కొన్ని విషయాలను మరచిపోవడానికి ఆవిషయాలపై అచేతనలో మనకుగల అయిష్టతే కారణ మంటాడు ఫ్రాయిడ్. అదే ఉదాసీనత (Apathy).

1:9 యముడు-సావిత్రితో సత్యవంతుడు దుర్మార్గుడనీ, అధముడనీ చెబుతాడు. అంతేకాదు సావిత్రి గనక తలతిప్పి చూస్తే సత్యవంతుని సత్యరూపం బయటపడుతుందని అంటాడు.

''సావిత్రీ! నేను నీ తండ్రివంటివాణ్ణి నామాట నమ్ము నువ్వు ప్రేమించేవాడు దుర్మార్గుడు అధముడు. అతని మీద ద్వేషంతో చెప్పడం లేదు. నిన్ను అన్యాయం చేస్తున్నాడు. .'' (పు.32)

'' . ఘోరంగా మోసపోయి, సమస్తమూ పోగొట్టుకొని అవతల మహాక్షోభ పడనియ్యడం కన్న, ముందే బాధాకరమైనా నిజం తెలియచేస్తే మంచిది నీతల కొంచం వెనక్కి తిప్పితే సరి, అద్భుతమైన మానసాతీతమైన సుందరమైన నీప్రేమ సంపూర్ణంగా భగ్నమైపోతుంది. పాతివ్రత్యంతో విశ్వాసంతో ప్రేమతో మెరిసేకళ్ళు అటు తిప్పావా, యింతవరకు స్త్రీ హృదయంలో యెన్నడూ జనించని మరణాన్ని ధిక్కరించగలిగిన నీప్రేమ కూడా చావుదెబ్బతిని, కిందపడి తన్నుకునే హంసవలె నశిస్తుంది. యీనాడు కారే కన్నీళ్ళు తుడవడానికి వీలువుండవచ్చును గాని, తరువాత కలిగే దుర్భరమైన వేదనని తొలగించడం యెవరిచేతాకాదు '' (పు 32,33)

ఈ మాటలు సావిత్రి హృదయాన్ని తాకాయి. ఆమెలో అలజడి చెలరేగింది. మనసులో 'ఘర్షణ' (Conflict) ప్రారంభమయింది. అయితే ఆమెలో ఇడ్ బలమైంది కావటంచేత 'సూపర్ ఈగో' గొంతునొక్కి వేయబడింది ''అబద్ధం, మాయ.. చూడఖ్ఖర్లేదు. . (తల) తిప్పను.. వినను... చూడను.. '' (పు 33) అని దృఢంగా అని ఆ అలజడి లేక ఘర్షణ నుంచి విముక్తి పొందుతుంది.

1:10 సత్యవంతుణ్ణి పునరుజ్జీవితుణ్ణి చేయటానికి ఆమె శీలాన్ని ప్రతిఫలంగా కోరతాడు యముడు. సావిత్రి తనలోని 'సూపర్ ఈగో' ప్రభావంవల్ల యముడికి నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తుంది. ''యింకొకరిదైన యీ శరీరంమీద మీకెందుకు యీవాంఛ? మీమీద అనురాగం లేని నన్ను అనుభవిస్తే, మీకేం ఆనందం? యీ సహాయం చేస్తే, మా యిద్దరి హృదయాల్లోనూ, శాశ్వతంగా మీపై కృతజ్ఞత...'' (పు.38)

స్త్రీ పురుషులు శారీరకంగా కలవడానికి కావలసిన ముఖ్యమైన అనురాగం, ప్రేమ అనేవి లేకుండా కలవడం నీచం అంటుంది. ఈ మాటలు 'సూపర్-ఈగో' ప్రభావంతో అన్నవే! అయితే యముడు ఒప్పుకోడు సమయం మించి పోతుందని తొందర పెడతాడు సావిత్రి ''యింతే.... యింతే.... తప్పదూ? యింకగతి లేదూ?'' (పు.39) అని ప్రశ్నిస్తుంది మరో అవకాశం లేదనీ, మాటతప్పితే సత్యవంతుణ్ని నాశనం చేస్తాననీ యముడు బెదరిస్తాడు గత్యంతరం లేదని తెలిసికొన్న సావిత్రి యముడి కోరికను మన్నించటానికి సుముఖత చూపుతుంది. సావిత్రికి కావలసినదాన్ని సాధించుకొనే మార్గం ఇది ఒక్కటే! సామాజిక నీతినియమాలకు విరుద్ధంగా ఉన్నా - ఈమార్గాన్ని

ఎన్నుకోటానికి కారణం సావిత్రిలోని ఇడ్ - సూపర్ ఈగోని అణచి వేయటమే! ఇడ్ బలం వల్ల ఈగో, సూపర్ ఈగోలు అణగిపోతాయని మనస్తత్వశాస్త్ర వేత్తల నిరూపణం

ఒప్పదం ప్రకారం యముడి దగ్గరకు వెళ్ళటానికి సావిత్రిలోని 'సూపర్ ఈగో' ఒప్పుకోదు అందువల్లే తనలో తాను తర్కించుకుంటుంది గత్యంతరం లేక యముణ్ని చంపటానికి వెళుతుంది ఆమె వెళ్ళేటప్పటికి యముడు నిద్ర పోతుంటాడు. (నటిస్తాడు) ''కానీ నిద్రపోతున్నాడే? మేలుకొని వుండి, కామంతో నన్ను కావలించుకోవస్తే యెంత సులభమయేది, కాని నిద్రపోయేవాణ్ని '' (పు 46) ఈ మాటలు సావిత్రిలోని ఈగోని పట్టిస్తాయి. అయితే పరిస్థితుల్ని బట్టి హెచ్చరించేది సూపర్ఈగో యముణ్ని చంపటం కృతఘ్నత అయినా ఆమెకు అది తప్పనిది అదే ధర్మం, న్యాయం, పుణ్యం - అని తనకు తానే నచ్చచెప్పుకుంటుంది

సావిత్రి తన చివరి ప్రయత్నంగా యముణ్ని చంపటానికి ప్రయత్నిస్తుంది యముని మెప్పును పొందుతుంది

''నన్ను అట్లా చంపడానికి నిశ్చయించుకోకపోతే, ప్రేమకోసం ధర్మాన్ని కూడా త్యజించగలిగిన మహాపతివ్రత సావిత్రి యెట్లాకాగలవు''. (పు.47)

''సావిత్రి తనను త్యాగం చేసుకొని, తన పవిత్రమైన ప్రేమని మలినం చేసుకోడానికి నిశ్చయించుకొని వుండవొచ్చును. అప్పుడు అద్భుతమైన సావిత్రి యెట్లా అయేది?''(పు 48).

''ప్రేమ కోసం, పాపానికి వెనుదీసే ప్రేమ ప్రేమ కాదనుకుంటాను ..'' (పు.48)

''ప్రేమజ్యోతిని శిరస్సున ధరించి విధిని జయించింది సావిత్రి.'' (పు 47)

- ఇత్యాదిగా యముని ప్రచుర ప్రశంసల్ని పొందుతుంది సావిత్రి.

1 11 ఫ్రాయిడ్ - మనిషి అంతర్వ్యక్తిత్వంలో ఇడ్‌తో పాటు, ఈగో, సూపర్ ఈగోలకు సమాన ప్రాధాన్యం ఇచ్చాడు వీటి వీటి ప్రధాన గుణాలలో 'విలక్షణత' ఏర్పడితే సంఘర్షణ (Conflict) ఉత్పన్న మవుతుందనీ, ఆ సంఘర్షణవల్ల 'అపసామాన్యత' (Abnormality) వస్తుందనీ పేర్కొన్నాడు ఫ్రాయిడ్. కానీ సావిత్రిలో ఇడ్ అత్యంత బలవత్తరమైంది. కాబట్టే ఆమెలో సంఘర్షణ అపసామాన్యతకు దారితీయలేదు. సావిత్రేకాదు చలం సృష్టించిన స్త్రీ పాత్రలన్నీ ఇంచు మించు ఇలాంటివే!

1 12 సమాజంలో స్త్రీ పురుషుల మధ్య నెలకొని వున్న అసమానతలు చలాన్ని వేదనకు గురిచేశాయి. స్త్రీకొక న్యాయం, పురుషుడికొక న్యాయం చలామణిలో ఉండటాన్ని ఆయన భరించలేకపోయాడు. స్త్రీలను తరతరాలుగా సంప్రదాయపు సంకెళ్ళలో బంధించటం ఆయనకు అమానుషంగా తోచింది. అందువల్లే తన పాత్రలన్నింటి విషయంలోను 'వాంఛా సఫలత' కు ప్రాధాన్యం ఇచ్చాడు ఫ్రాయిడ్ మనోబాధ విముక్తికి చెప్పిన మార్గం ''ఉదాత్తీకరణం'' (sublimation) సాహిత్యం, చిత్రలేఖనం మొదలైన కళల సృజనలో తత్సృష్టికర్తల మనసులో చోటుచేసికొనే భావాలు, స్థితిగతుల్ని గురించి ఫ్రాయిడ్ చెప్పిన అభిప్రాయాలను ఫ్రెడరిక్ క్రూస్ విశ్లేషించి చూపాడు సుప్తచేతన (subconscious) లోని వాంఛాస్వరూపం, వాంఛా సఫలత సృజనాత్మక కళారూపంలో ప్రకటిత మవుతుందనీ, ఏకళ అయినా సుప్త చేతనలోని ''వాంఛలనే వస్తువుల ప్రదర్శనశాల'' అవుతుందనీ ఫ్రాయిడ్ అభిప్రాయం. స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి చలం సుప్తచేతనలో గుప్తంగా ఉన్న భావాలు ఆయన సృష్టించిన, చిత్రించిన పాత్రలలో వ్యక్తస్థితిలో కనిపిస్తాయి. పౌరాణిక సావిత్రికి భిన్నంగా చలం చిత్రణలో రూపు సవరించుకున్న పాత్ర సావిత్రి.

కొత్తవెలుతురు

# మేధావుల చిత్రణ

– ఎన్. ఇన్నయ్య

ఒకసారి మన దేశం నుండి ఒకాయన ''ఎడ్వర్డ్ షిల్స్, సోషల్‌సైంటిస్ట్, ఇంగ్లండ్'' అని ఉత్తరం, రాస్తే అది చేరింది! ఇది బ్రిటిష్ పోస్టల్ విధానపు గొప్పతనం చాటుతుండగా, ఎడ్వర్డ్ షిల్స్ ఖ్యాతిని కూడా చూపుతున్నది

సోషియాలజి అంటే కొద్దోగొప్పో తెలిసిన ప్రతివారికీ ఎడ్వర్డ్ షిల్స్ పరిచయమే ప్రపంచ మేధావుల గురించి రాసిన షిల్స్, తానూ ఆ కోవలోని వాడే అతని పుస్తకం ఈ సంవత్సరం వెలువడింది. (PORTRAITS by Edward Shils Introduction, edited Joseph Epstein,The University of Chicago Press, London & Chicago 1977, PP 255, 1/8 Demmy Size Paper book)

10 మంది మేధావుల గురించి ఎడ్వర్డ్ షిల్స్ రాసిన వ్యాసాలను ఎంపిక చేసి, ఆయన మరణానంతరం ప్రచురించారు. 1995 జనవరి 23న షిల్స్ 84వ ఏట కాన్సర్‌తో చికాగోలో మరణించారు అమెరికన్ స్కాలర్ అనే మేధావుల పత్రిక సంపాదకుడు జోసెఫ్ ఎప్‌స్టైన్ సుదీర్ఘ షిల్స్ గురించి పీఠిక రాసి, ఆసక్తికరంగా అందించారు

మన దేశంనుండి నిరాద్ చౌదరి మాత్రమే యిందులో వుండగా, మిగిలిన వారు రేమండ్ ఆరన్, సిడ్నీ హుక్, రాబర్ట్ మేనార్డ్ హచిన్స్, లె పోల్డ్ లబెజ్, హరాల్డ్ లా స్కీ, కార్ల్ మన్‌హం, ఆర్నాల్డో డాంటె మొమిగ్లి యానో, జాన్‌యు నెఫ్, లియోజి లార్డ్ వున్నారు షిల్స్ రాసిన మేధావుల పీఠిక కూడా వుంది

ఎడ్వర్డ్ షిల్స్ మన దేశ మేధావులకు సుపరిచితుడు 1956 నుండి 57 వరకు ఇండియాలోగడిపిన షిల్స్, ఆతరువాత యేటా ఒకసారి వచ్చి వెడుతుండేవాడు 1967 వరకూ అప్పుడే ఒకసారి బొంబాయిలో 1964లో ఎ బి షాతో ఆయన్ను కలిశాను మినర్వా అనే పత్రిక నిర్వహించిన షిల్స్ అనేక రచనలు చేశారు. ఎన్‌కౌంటర్ పత్రికలో రాశారు The Bulletin of the Atomic Scientists అనేది కూడా లియోజి లార్డ్‌తో కలసి నిర్వహించారు. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్, క్రేంబ్రిడ్జి, చికాగో యూనివర్శిటీలలో ప్రొఫెసర్‌గా పనిచేసిన ఎడ్వర్డ్ షిల్స్‌ను సమకాలీన ప్రపంచ మేధావులతో సన్నిహిత పరిచయం వుంది భారత మేధావుల గురించి ఒక పెద్ద వ్యాసం రాశారు, అలాగే యూరోప్ మేధావుల గురించి కూడా

ఆర్నాల్డో మొమిగ్లియానో (Arnaldo Momigliano)ను తన గురువుగా షిల్స్ భావించాడు ఆయన మెచ్చుకున్న మేధావులలో ఎ ఎస్ నయపాల్, ఫిలిప్ లార్కిన్, పీటర్ బ్రౌన్, అలెగ్జాండర్ సోల్జి నిట్సిన్, బార్బగాహి ఇ.హెచ్ గోంబ్రిక్, ఎలికెడోరి వున్నారు

రేడియో, టి వి సైతం వాడకుండా, న్యూయార్క్ టైమ్స్‌కే పరిమితమైన ఎడ్వర్డ్ షిల్స్, సాహిత్యం ద్వారా సోషియాలజీలోకి వచ్చిన మేధావి. ఆయన రచనలు ప్రామాణికంగా ఉన్నత స్థాయిలో వుండేవి.

చికాగో విశ్వవిద్యాలయంలో ఒకప్పుడు ఎంత వున్నతస్థాయి పరిశోధన, పరిశీలన, బోధన కొనసాగిందో షిల్స్ పీఠికలో అవగాహన అవుతుంది హరాల్డ్‌లాస్‌వెల్, టాల్కాట్‌పార్సన్స్, రాబర్ట్ పార్క్, ఫ్రాంక్‌నైట్ వంటి వారు ఉద్దండులుగా వున్న యూనివర్శిటీలో షిల్స్ రాటు తేలాడు. వారి సహచర్యం, బోధనా పటిమలు స్ఫురణకు తెచ్చుకొని, ప్రస్తుతించాడు. కాని ఎక్కడా అతిశయోక్తి భట్రాజీయం కనిపించదు. షిల్స్ అంచనాలు మాత్రం ఆకర్షణీయంగా వున్నాయి. లూయిస్ విర్త్ (Louis Wirth) తనపై చూపిన ప్రభావాన్ని షిల్స్ వివరించారు.

జాన్ నెఫ్ నాడు చికాగో విశ్వవిద్యాలయంలో పేరొందిన ఆర్థిక శాస్త్రవేత్త అతని లెక్చర్స్ కూడా షిల్స్ విన్నాడు అప్పటికే మాక్స్ వెబర్, ఎమిలిడర్క్‌హైగెల సోషియాలజీతో ప్రభావితుడైన షిల్స్ చికాగో వాతావరణంలో పై స్థాయికి ఎదిగాడు ఆపరిస్థితులు నేడు మారి పోయాయని, ఫెడరల్ ప్రభుత్వ యిష్టాయిష్టాలపై వుండడం, నిధుల కోసం ట్రస్టీలపై ఆధారపడడం, గిరిగీసుకొని గూడుకట్టుకొని ముడుచుక పోవడం నేడు స్పష్టంగా వున్నదనీ షిల్స్ విచారం వ్యక్త పరిచారు నేటికీ చికాగో ఉన్నతస్థాయి విద్యావాతావరణం వున్నదని వారితో షిల్స్ అంగీకరించ లేక పోయాడు తరాల అంతరం కనిపిస్తున్నదన్నాడు షిల్స్ పీఠిక కాగానే, ఒక్కొక్క వ్యక్తినీ కూలంకషంగా పరిశీలించిన వ్యాసాలు వున్నాయి

**రేమండ్ ఆరన్** . ఫ్రాన్స్‌లో 1983 అక్టోబరు 17న అస్తమించిన సుప్రసిద్ధ సామాజిక శాస్త్రజ్ఞుడు రేమండ్ ఆరన్ (RAYMOND ARON) ప్రపంచంలో కీన్స్ (Keynes) తరువాత, అంతగా ఆకర్షించిన సోషల్ సైంటిస్టు. ఆయన మాటను యూరోప్, అమెరికా ప్రముఖులు పట్టించుకునేవారు. హెన్రీకిసింజర్, రాబర్ట్ మక్‌నమారా వంటి వారు చెవిన పెట్టే వారు కాని ఫ్రాన్స్‌లో ఆయనను ఏకాకిని చేసి రియాక్షనరీ అని, ఫాసిస్టు అని వామపక్షాలవారు పేర్లు పెట్టారు ఆంద్రి మాల్రా (Andre Malrawx) వంటివారి అభిమానాన్ని పొందిన ఆరన్ చివరి రోజులలో ఫ్రాన్స్ దృష్టిని ఆకర్షించారు మార్క్సిజం పట్ల నిశిత పరిశీలన చేసిన ఆరన్, ఆచరణకూ సిద్ధాంతానికీ మార్క్సిజం చూపిన అఖాతమే దాని పట్ల ఫ్రాన్స్ వైముఖ్యతకు కారణమన్నాడు

విద్యారంగంలో సామాజిక వేత్త గా, ప్రభుత్వరంగంలో ప్రచార వేత్తగా రచనలు చేసిన ఆరన్ బహుముఖ ప్రజ్ఞాశాలిగా ఖ్యాతిని తెచ్చుకున్నాడు. ప్రజాసమస్యల పట్ల స్పందించిన ఆరన్, బృహత్తర రచన చేయలేక పోయానని చివరలో బాధపడ్డాడు

ఆదర్శాలు (utopias) ఆరన్‌ను ఎన్నడూ ఆకట్టుకోలేదు ఏ సమాజమూ సంపూర్ణం కాదనీ, ప్రతిదీ విమర్శకు గురిచేయాలనీ, మార్గాంతరాలతో బేరీజు వేయాలనీ, ఆరన్ ఉద్దేశం వివేచన యథేచ్ఛగా వినియోగించాలన్నాడు

ఆరన్‌తో తన 40 సంవత్సరాల పరిచయాన్ని షిల్స్ చక్కగా కుదించి వివరించారు జాన్‌పాల్‌సార్త్రె ఒకవైపున ఆరన్‌ను విపరీతంగా ఖండించినా, ఆరన్ అతడి పట్ల ఓర్పుగా వ్యవహరించిన తీరును పేర్కొన్నారు. మానవసమాజాలను తాత్వికంగా పరిశీలించిన ఆరన్ ఎన్నో ఒడిదుడుకులకు, విమర్శలకూ, ఖండన మండనలకూ తట్టుకున్నాడన్నారు. మానవ మస్తిష్కంనుండి హేతువును మట్టుబెట్టడం దుస్సాధ్యమని ఆరన్ దృఢ విశ్వాసం. వివేచన పట్ల అచంచల విశ్వాసంతోనే ఆరన్ రచనలు సాగించాడు. నిగ్రహంగా వ్యవహరిస్తూ, ఇతరుల పట్ల జాగ్రత్త వహిస్తూ, మేధావిగా సమాజాన్ని ప్రభావితం చేసిన వ్యక్తిగా ఆరన్‌ను షిల్స్ పేర్కొని, జోహార్లు అర్పించారు.

22 పుటలలో ఆరన్ గురించి ఎంతో నిగూఢంగా షిల్స్ చూపగలిగారు. ఆయన వెలుగు నీడల్ని అందంగా పేర్కొన్నారు వ్యక్తిత్వం అంచనా వేసిన తీరు చూచి మనం ఎంతో నేర్చుకోవచ్చు. రేమండ్ ఆరన్ గురించి మనలో చాలామంది చదివినా, షిల్స్ చెప్పిన తీరు హుందాగా, వివేచనాత్మకంగా, నిష్పాక్షింగా వుంది. వ్యక్తి చిత్రణ అలావుండాలి సన్నిహిత పరిచయంగల మేధావిని గురించి ముఖస్తుతి చేయకుండా, లోకానికి అద్దం పట్టిచూపడం షిల్స్ వంటి సామాజిక శాస్త్రజ్ఞుడికే తగును.

**నిరాద్ సి. చౌదరి** · షిల్స్ చిత్రణలో ఒక భారతీయ మేధావి నిరాద్ చౌదరి చోటు చేసుకున్నాడు

ఆ విధంగా ప్రపంచ మేధావుల కోవలో నిరాద్ చౌదరి నిలబడ్డాడు. షిల్స్‌కు బాగా పరిచితుడు, యిష్టుడైన మరొక భారతీయ నవలా కారుడు ఆర్.కె. నారాయణ.

1921 లో కలకత్తా యూనివర్సిటీలో డిగ్రీ పొందలేక, చదివేసిన నిరాద్ చౌదరి ఆలిండియా రేడియోలో ఉద్యోగం చేస్తూ పదవీ విరమణానంతరం ఇంగ్లండ్ ప్రవాసం వెళ్ళాడు. రచయితగా భారతదేశంలో పేరున్నా బ్రతకడానికి తగిన ఆదాయం లభించలేదు. ఆయనకు భార్య ప్రోత్సాహంతో దేశాంతరం వలస, పెద్ద పేరు పొందాడు. కాని దేశాన్ని గమనించడం మానలేదు. ఆయన నిశిత పరిశీలన, విమర్శ చాలామందికి నచ్చక పోయినా, అలాగే చెప్పదలచింది నిర్మొహమాటంగా రాశాడు. గాంధీజీ పట్ల తీవ్ర విమర్శ చేస్తూ, దేశాన్ని వెనక్కు నడిపించే ఆయన ధోరణిని దుయ్యబట్టాడు. ఆయన రచనలలో ది ఆటోబయోగ్రఫీ ఆఫ్ ఏన్ అన్‌నోన్ ఇండియన్, ది హేండ్ గ్రేట్ అనార్క్ అనే రెండూ గొప్పవని షిల్స్ పేర్కొన్నారు. భారత సమాజం పాశ్చాత్య భావాలతో సంబంధం అనేది చౌదరి దృష్టిని బాగా ఆకట్టుకున్నాయి. 50 సంవత్సరాల ప్రాయంలో తొలి రచన ప్రచురించిన చౌదరి ది ఇండియన్ ఇంటలెక్చువల్, హిందూయిజం, కాంటినెంట్ ఆఫ్ సర్సి, క్లైవ్, మాక్స్ ముల్లర్ గురించి రాశారు.

భారతీయుడుగా, బెంగాలీగా, యూరోపియనుగా, ఇంగ్లీషుమన్‌గా స్పందించిన చౌదరి, విశిష్ట రచయితగానే నిలిచాడు. ప్రపంచ పౌరుడుగా పరిణమించాడు.

పొట్టిగా, బక్కపలచగా వుండే చౌదరి, ఎంతో ఆత్మ విశ్వాసంతో, నిబ్బరంగా రచన సాగించి తన జ్ఞాన పరిధిని విస్తరించి, ప్రతిభ చూపాడని షిల్స్ రాశారు. ఇంగ్లండ్‌లో స్థిరపడినా ఇండియాను వదలని రచయిత చౌదరి, భారతదేశ విభజన పట్ల కూడా ఆయన బాధతో రచన చేసి Thy Hand లో చూపారు.

1955 లో తొలుత యూరోప్ వెళ్ళిన చౌదరి అట్టే ప్రయాణం చేయని రచయిత. అంతవరకూ కలకత్తా లోనే గడిపిన చౌదరి, ప్రపంచాన్ని ఎంతో సన్నిహితంగా చూడాడని షిల్స్ అన్నారు. బ్రహ్మసమాజ ప్రభావితుడైన చౌదరి, ఉదారవాది.

చౌదరి ఇంగ్లీషులో రాయడం మొదలు పెట్టిన తరువాత, ఇంగ్లండులో గుర్తింపు లభించింది. క్రమంగా ప్రపంచం గుర్తించింది. భారతదేశంలో ఆయనకు అవమానాలు నిరాదరణ వున్నా, తట్టుకొని నెగ్గుకొచ్చాడు. తలవంచని రచయితగా నిరాద్ చౌదరి తన అభిప్రాయాలను చాటాడు. చాలా లోతుగా అధ్యయనం చేసిన అనంతరమే రచనకు ఉపక్రమించే వాడు.

ఎడ్వర్డ్ షిల్స్ తన అభిప్రాయాన్ని వెల్లడించి చౌదరికి న్యాయం చేకూర్చాడు.

**సిడ్నీహుక్** : రాజకీయం పలికినా, తత్వం మాట్లాడినా సిడ్నీహుక్ హేతుబద్ధంగా రాసేవాడు. ఆయన ప్రభావం సమకాలీన సామాజిక శాస్త్రాలపై చాలా కనబడుతుంది. బెర్ట్రాండ్ రస్సెల్, జాన్ డ్యూయీ, మోరిస్ కోహెన్‌ల శిష్యరికం చేసిన సిడ్నీహుక్ మార్క్సిజం బాగా అధ్యయనం చేశాడు. సత్యాన్వేషణ అత్యున్నతమైనదని ఆయన సిద్ధాంతం. సోషలిస్టు భావాలు వున్నా, ప్రజాస్వామ్యాన్ని, వ్యక్తి స్వేచ్ఛను తప్పనిసరిగా ఆదరించాలన్నాడు.

రాజకీయాలు వాదించేటప్పుడు చాలా పట్టుదల చూపెట్టిన సిడ్నీ హుక్ వివేచన మాత్రం ఎన్నడూ సడలించలేదు. 1920 ప్రాంతాలలో సోవియట్ యూనియన్ పట్ల అమెరికాలో కమ్యూనిస్టు పార్టీ పట్ల కొంత్ర సానుభూతి చూపినా, మిగిలిన వామపక్ష మేధావుల వలె ప్రవాహానికి కొట్టుక పోలేదు. గుడ్డిగా కమ్యూనిస్టులను వ్యతిరేకించే వారి పట్ల సిడ్నీహుక్ తన అయిష్టత చూపాడు.

ట్రాట్స్కీ రక్షణ సంఘంలో పాల్గొన్న హుక్, మాస్కోలో మారణ కాండపై విచారణలో ఆసక్తి చూపి, సాంస్కృతిక స్వేచ్ఛ కావాలనే సంఘాల స్థాపనలో చేరాడు ప్రజా జీవిత సమస్యలతో స్పందించిన హుక్, రేమాండ్ ఆరన్ వలె చాలా సందర్భాలలో పాల్గొని, వివాదాస్పద చర్యలకు దిగాడు. చాలా ప్రతిభావంతుడైన యూదుగా హుక్ తన జీవితంలో అత్యధిక కాలం న్యూయార్క్‌లోనే గడిపాడు

**హరాల్డ్ లాస్కీ**

లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్‌లో 3 దశాబ్దాలు పనిచేసిన లాస్కీ పుస్తకాలు నేడు ఆ సంస్థలోనే చదవడం లేదు కాని ఆయన సమకాలీనులు రాజకీయాల్లో లాస్కీ వద్ద వ్యాకరణం నేర్చారు ప్రపంచ వ్యాప్తంగా లాస్కీ ప్రభావం వుండగా, వామ పక్షాలపై యీ ప్రభావం వీరారాధనకు పోయింది 1993 లో లాస్కీ శతజయంతి కూడా జరిపారు

మాంచెస్టర్ సంపన్న యూదుకుటుంబంలో పుట్టిన హెరాల్డ్ లాస్కీ, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో బోధించి గొప్ప పేరు పొందాడు తరువాతే లండన్‌లో స్థిరపడి 1950లో చనిపోయే వరకూ ఉపాధ్యాయుడుగా వున్నాడు ఆయన రచయితే గాక, గొప్ప వక్త కూడా ఇంగ్లండ్ రేషనలిస్ట్ సంఘాధ్యక్షుడుగా కొంతకాలం వున్న లాస్కీ, లేబర్ పార్టీ, సోషలిస్టుగా వున్నాడు అయితే ఒకసారి నమ్మిన వాటిని మళ్ళీ మళ్ళీ రాస్తూ, కాలానుగుణంగా వస్తున్న మార్పుల్ని సరిగా గమనించక పోవడం ఆయన లోపం

ఫేబియన్ సోషలిస్ట్‌గా పరిణమించిన లాస్కీ, బలీయ కేంద్ర ప్రభుత్వం పట్ల విశ్వాసం ప్రకటించాడు కొన్నాళ్ళు సిడ్నీ బీట్రిస్ వెబ్ సిద్ధాంతాల ప్రభావం కింద లాస్కీ వున్నాడు సోవియట్ యూనియన్‌ను సమర్థించి, అమెరికా సామ్రాజ్యవాదాన్ని లాస్కీ ఖండించాడు లెఫ్ట్ బుక్ క్లబ్ స్థాపించిన లాస్కీ అటు ఉపాధ్యాయుడుగానూ యిటు ప్రపంచ వ్యవహారాలలోనూ ఆసక్తితో పాల్గొన్నాడు

**లియో జిలార్డ్**

అణ్వాయుధాలు సోవియట్ యూనియన్, అమెరికాల మధ్య ప్రచ్ఛన్న పోరాటసమస్యలలో కీలక పాత్ర వహించిన మేధావి లియోజిలార్డ్ (Leo Szılard) అతడు సామాజిక, రాజకీయ, ఆర్థిక విషయాలలో ప్రతిభాశాలి శాస్త్రీయ పరిశోధనకు అగ్రతాంబూలం యిచ్చాడు 1932 లోనే హిట్లర్ అధికారానికి రాబోతున్నాడని గ్రహించి యితరులను హెచ్చరించిన యింగిత జ్ఞాని. 1937లో అతడు యూరోప్ నుండి అమెరికా వలస వెళ్ళి ప్రధాన పాత్ర వహించాడు. అణుశాస్త్ర పరిశోధనలు బయట పెట్టవద్దని జర్మనీ పాలకుడైన హిట్లర్‌కు అవి తెలిస్తే ప్రమాదం అని హెచ్చరించాడు.

బాంబు ప్రయోగాన్ని గురించి అమెరికా అధ్యక్షుడికి నచ్చ చెప్పడానికి ఐన్‌స్టీన్‌న్ని కూడా రంగంలో దింపాలని జిలార్డె ప్రయత్నించాడు. ది వాయిస్ ఆఫ్ ది డాల్ఫిన్స్ అనే రచన చేసిన జిలార్డ్, తరచు ఆటమిక్ సైంటిస్టుల బులిటన్‌లో వ్యాసాలు రాసేవాడు. ''ఆటెమ్స్ పర్‌పీస్'' బహుమానం పొందిన జిలార్డ్ చివరి దాకా ఆస్థి పాస్తులు లేకుండా బ్రతికిన మేధావి. తన అభిప్రాయాలు అటు కృశ్చేవ్ కూ, యిటు కెనడీకి తెలియపరచిన జిలార్డ్, కాన్సర్ వ్యాధితో మరణించాడు ఆయన మేధస్సుకు ఎడ్వర్డ్ షిల్స్ చాలా గొప్పగా హారతులిచ్చాడు.

**జాన్ యునెఫ**

చికాగో విశ్వవిద్యాలయ స్థాపకులలో ఒకరైన నెఫ్ గొప్ప మేధావి. ఆయన బొగ్గును గురించి

రాసినా, అందరినీ కథవలె చదివించగల సత్తా వున్న ప్రతిభావంతుడు వాస్తవానికి బొగ్గుపరిశ్రమపై ఆయన చేసిన పరిశోధన గొప్పది

30 సంవత్సరాల పాటు చికాగో విశ్వవిద్యాలయంలో పనిచేసిన నెఫ్ సోషల్ థాట్ పై ఒక సంఘాన్ని ఏర్పరచాడు

నెఫ్ లెక్చరర్‌గా చాలా క్రమబద్ధమైన వాడని షిల్స్ అన్నాడు బ్రిటీష్ బొగ్గు పరిశ్రమ గురించి విద్యార్థులను ఆకట్టుకునే లెక్చర్ యివ్వడం నెఫ్‌కే చెల్లిందన్నాడు ఆర్థిక రంగంలో కవిత్వాన్ని జొప్పించి, టి ఎస్ ఇలియట్‌ను ప్రస్తావించగల సమర్థత నెఫ్‌కు వున్నది తన పరిశోధనా ఫలితాలను బేరీజు వేసి క్లాసులో చెప్పడం ఆయన అద్భుత ప్రతిభగా షిల్స్ చెప్పారు ప్రతి తరగతిలో కొత్త విశేషాలను చెబుతూ, జర్మనీలోని విద్యారంగ లక్షణాలు అమెరికాలో ప్రవేశపెట్టిన ఖ్యాతి నెఫ్‌కు దక్కాలని షిల్స్ అంటారు

షిల్స్ రాసిన మేధావులలో కార్ల్‌మన్ హైం సుప్రసిద్ధ సామాజిక శాస్త్రజ్ఞుడు మేధావులకు సంబంధించిన ఆయన దృక్పధం షిల్స్‌ను ఆకట్టుకున్నది కాంట్ వలె తానూ ఆకర్షించాలని మన్‌హైం భావించినా, అది సఫలం కాలేదు లండన్ స్కూల్ ఆఫ్ ఎకనిమిక్స్‌లో ఆయనకు తగిన ఆదరణ లభించ లేదు

అమెరికాలో తన రచనలు గురించి ఏమనుకుంటున్నారో అనే విషయమై అతడు శ్రద్ధగా పట్టించుకునే వాడు

కార్ల్ పాపర్ రాసిన పావర్టి ఆఫ్ హిస్టారిసిజం విమర్శ ప్రధానంగా మన్‌హైంను దృష్టిలో పెట్టుకున్నదే హైక్ (Hayey) రాసిన రోడ్ టు సెర్ఫడం కూడా మన్‌హైంపై విమర్శతో కూడిందే సోషియాలజీ ప్రొఫెసర్ మారిస్ గింజ్‌బర్గ్ కూడా మన్‌హైంపై ధ్వజమెత్తి విమర్శలు చేశాడు మన్ హైం చనిపోయినప్పుడు ఎడ్వర్డ్ షిల్స్ వెళ్ళగా, గింజ్‌బర్గ్ తన భర్తను చంపేసినట్లు (విమర్శలతో!) ఆయన భార్య విలపిస్తూ అన్నది

గలీలియో సొసైటీలో సభ్యులుగా మైకెల్ పొలాని, మన్‌హైంలు సన్నిహితులు కాని అభిప్రాయాలలో విరుద్ధంగా వుండేవారు టి యస్ ఇలియట్ యితడిమేధస్సును శ్లాఘించాడు అయినా ఇంగ్లడులో ప్రవాసిగా మన్‌హైం యిమడ లేక పోయాడు

**అర్నాల్డ్ డాంట్ మొమిగ్లి యానో**

మేధావులకు, పరిశోధకులకు తెలిసిన మొమిగ్లియానో, బహుళ ప్రచారం లేని గొప్ప వ్యక్తి అతని రచనలన్నీ 750 వరకూ వున్నవి. ఇతడు 1908 లో పుట్టాడు యూదు ఆక్స్‌ఫర్డ్‌లో కృషి చేశాడు ఇటలీలో రాని రాణింపు అక్కడ వచ్చింది చికాగాలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా వుండేవాడు. గిబ్బన్ గొప్పవాడని, మైకల్ రోస్టొ విజఫ్ (Mikhail Rostovzeff) ప్రాచీన చరిత్ర పండితులలో గొప్ప వాడని మొమిగ్లోయానో అనేవాడు కేంబ్రిడ్జి ప్రాచీన చరిత్రలో యితడి ప్రతిభ కనిపిస్తుంది చివరి దశలో బాగుగా గుర్తింపు, రాణింపు, ప్రచారం లభించగా తృప్తి చెందిన మేధావి. మతనమ్మకాలు ఉపరితల విషయాలుగా భావించరాదని, యీ విషయమై మార్క్సిస్టు దృక్పధం సరైనది కాదని ఆయన భావించాడు

రాబార్ట్ మెనార్డ్ హచిన్స్, లియోపోల్డ్, లబెజ్ గురించి విశిష్టంగా షిల్స్ జోహార్లు అర్పించాడు

మేధావులను గుర్తించడం వారి ప్రతిభకు జోహార్లు అర్పించడం, అందులో అతిశయోక్తులు లేకుండా అంచనా వేయడం షిల్స్ పుస్తక విశేషం. దీన్నుండి మన రచయితలు నేర్చుకోదగింది వుంది

# స్వప్న బీభత్సంలో అక్షరాకృతి

(ప్రముఖకవి అజంతాగార్కి ఇటీవల కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించిన సందర్భంగా ఈ వ్యాసం - సంపాదకుడు)

(గత సంచిక తరువాయి)

- ప్రొ. వెంకట్

మూలాధారాలనబడే అస్తిత్వాలకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, వ్యక్తంగానైనా, అవ్యక్తంగానైన దూరమవుతూ, దృష్టాదృష్టమవుతున్న మార్గాల్లో నడిచే ప్రయత్నమే ''సాహిత్య'' ప్రక్రియ వైశిష్ట్యత ఈ ప్రయత్నం వేదన ఏదో సాంప్రదాయికంగా కాలమాన భాషా ప్రవృత్తుల ద్వారా వ్యక్తి జీవితాల ద్వారా వర్గీకరించబడ్డ శిక్షా వ్యుత్పన్న (disciplinary, generic) కాల నిర్మాణాల్లాంటి కొలమానాలలో (సం) బంధించరానిది మూలాల్తో కుస్తీపడుతున్నప్పటికీ, సాహిత్య ప్రక్రియను మూలాల్తో పడే ఘర్షణగానే కాకుండా వాటిని కంగారు (Confound) పెట్టే ప్రక్రియగా గుర్తించడం మంచిది ఘర్షణ మూలాల్తో భిన్నత్వం మాపేఅవకాశం ఉంది కానీ ఈ ''కంగారు'' పరిచే ప్రక్రియ మాత్రం గతంతో మనకున్న సంబంధాన్ని, తద్వారా ఒనగే భద్రతని సంక్లిష్టం చేస్తుంది అది కొనసాగింపూ కాదు మరి విచ్ఛేదమూ కాదు. అలాగని అంగీకృత సమాధాన సాక్ష్యం కూడా అందులో ఉండదు ఇది ''సాహిత్యం'' ప్రదర్శించే మౌలికస్థితి, సాధ్యత (Whereas confounding complicates one's relation with provenance or the past it is neither continuity, nor discontinuity, nor both in a harmoniously reconcilable proportions It is this open-ended engagement with the fundamental conditions of possibility that "literature" performs). అది అంతులేని వికసించిన సంభాషణగా గుర్తించాలి. ఈ (అ) సాధారణ వైశిష్ట్యాన్ని చట్రాలలో బంధించిన సాహిత్యమనే రూపనిర్దిష్టతా ప్రక్రియగా మాత్రమే కుదించలేము ఈ విశిష్టత సాహిత్య మనే నిర్ధారిత రూపం నుంచి - పురాణ, ప్రబంధ, నవ్య, అభ్యుదయ వగైరా రీతుల సాహిత్య చరిత్ర - అంటే నిర్వచించబడిన రూపానికి భిన్నంగా ''ప్రక్రియ'' అనే పేరు/ పదం/ భావన/ పదచిత్రం/ వర్ప మీదకు మన దృష్టి సారించాలి నిజానికి ఇది ఆచరణకు - అంటే కవితా ప్రక్రియ రచనకు - సంబంధించింది. అంటే - మనమేం చేస్తున్నాం? ఎలా చేస్తున్నాం? అనేదే మౌలిక ప్రశ్న ఈ ప్రశ్న సిద్ధాంతీకరించడానికి కాకుండా ప్రక్రియా కరణానికి - practice కి (సాధనకు ఆచరణకు) సంబంధించిందిగా ఎదురొస్తుంది ఈ సమస్యని ఎదుర్కోవాల్సినప్పుడు మనచుట్టూ అందుబాటులో ఉన్న నమూనాలు/ రీతుల్లో పరిష్కారాలు దొరికిన వాటితో మనం తృప్తిచెందితే, సాహిత్య ప్రక్రియకు అక్కడ స్థానం లేదు.సాహిత్య ప్రక్రియ అక్కడ ఒక derivative existence (అనుబంధ స్థాయి)లో ఉంటుంది వాస్తవానికి సాహిత్య చర్యలో తీవ్రంగా నిమగ్నమైనప్పుడు, స్థిరంగా ఉన్న ఒక పరిస్థితిలో ఎలా స్పందించాలి - ఎలా జీవించాలి అనే నిరంతర ప్రశ్నగా వస్తుంది అందులోను నిర్ధారిత చర్య రూపాలు మృగ్యమైనప్పుడు - అంటే ఎక్కడా రక్షణగాని విశ్రాంతిగాని లభించని (లేని) జ్ఞాన సందర్భంలో ఎలా ప్రవర్తించాలి? (What we seem to learn from a rigorous engagement with the literary act is really the interminable question or how to act (i e , live) in a given situation - especially, in the absence of any acceptable forms or action. How to act in the absence, in that night or non-knowledge where there are no shelters of respite?)

అందుకే అజంతా కవిత్వంలో కనపడే ''సంబంధిత ప్రతీక'' (metonymy) రోడ్డు ''రోడ్డు'' ఆయన సంకలనానికి ప్రాణం

రోడ్లకు నా నమస్కారం..
రోడ్ల మీద నడుస్తూనే నేను కవిత్వం వ్రాస్తున్నాను ..
రోడ్లు నా ప్రాణం ..
రోడ్లు నా రహస్య సంకేతాలు
రోడ్లు నా జీవన వ్యాకరణం .
స్వప్న ఖచితమైన నా శరీరాన్ని రోడ్లకే అంకితం చేశాను కదా ..
రోడ్లు నా సర్వస్వం.

అజంతా రోడ్లను అవమానిత, గాయపడిన, బాధపడిన, ఛిద్రాంగపూరిత, చీకటినిండిన, దుఃఖార్త, హంతక, ఉడుకెత్తిన, క్రోధపూరిత, క్షుద్రాపీడిత - జనసందోహంతో నింపుతాడు. ఈ రోడ్లకు గమ్యం లేదు. ''నడుస్తున్న రోడ్డు మధ్యంలో మటుమాయం కావడం మృత్యువు'' కానీ మళ్ళీ ఈ రోడ్లే ''కలసి కొంటున్న చోట ఏదో కొత్త స్పృహ'' అజంతాలో రోడ్డు నిలకడైన భాషారామాలకు విరుద్ధంగా నిలుస్తుంది. భవనాలు శిక్షావాక్యాలలాగా ఉంటాయి వాటిలో మనుష్యుల్ని ఉరితీస్తారు అంటారు అజంతా.

ఈ అక్షర రక్షణ భవంతుల్లోంచి ఎంత విలయించినా, ఎంత విలపించినా అది '' ఆత్మాహత్యా సదృశ్యమే'' అవుతుంది. విచిత్రమేమిటంటే, అక్షర హింస కవిత్వం కాదంటారు అజంతా. అందుకే ఈ అక్షర హర్మ్యాల నుంచి బయటపడేందుకు పదే పదే భ్రమ రోడ్లను (hallucinatory roads) సృష్టిస్తారు. అజంతా రచనల్లో సందిగ్ధతలో లేని విషయమేదన్నా ఉందంటే ప్రథమంగా అది రోడ్లకు హర్మ్యాలకూ మధ్య ఆయన చూపే అంతరమే మరో విషయమేమిటంటే స్వప్నలిపిలోని రోడ్డుకెప్పుడూ ఒకే అర్థం లేదు. అజంతా రోడ్డెప్పుడూ బీభత్సరస ప్రధానమైనదైనా అది కొత్త సృష్టిని స్ఫురింపించేసి కూడా. ''కొత్త భాష ఆవిర్భావం అక్కడే'' అంటాడు అజంతా. కానీ హర్మ్యాలకే confounding existence ( కలవరపరచే అస్తిత్వం) లేదు. ఒక్కసారి సిద్ధాంతరీత్యా శిష్టా వాక్యాలవల్లే అలంకృత మౌతాయో, జీవహరిత యంత్రాలవల్లే భవంతులు మిగిలిపోతాయి.

నిర్మాణ పరంగా (Structurally), ఈ రోడ్లు, శరీరించిన అక్షరం రెండూ ఒకే స్థానంలో ఉంటాయి అజంతా రచనల్లో:

రోడ్లు నా ఇతివృత్తం
రోడ్లు నా ఛందస్సు
రోడ్లు నా నిఘంటువు, నా అక్షర ప్రపంచం అదే.

అందుకే స్వప్నలిపిలో అక్షరాలు హర్మ్యాలు నిర్మించవు. ప్రతీ వాక్య పదీయం ఇందులో ఒక హింసకు గురైన, శిథిలశరీరంలా మనని కలవరపెడుతుంది అజంతా రచనల్లోని పదాక్షరాల తీరులో ఆయన వేసే కాల్పనిక రోడ్లలో కూడా మనకు ఖండిత హస్తాలు, భయకంపిత శబ్దాలు, బద్దలైన శరీరాలు, అస్థిక వికసిస్తున్న శబ్దాలు, శిరస్సు తెగిన దీపస్థంబాలు, శిధిలవృక్షాలు, విధ్వంసక యంత్రాలు, రోడ్డు పొడువుగా చెట్లు కూలుతున్న దృశ్యాలు, మృత కళేబరాలున్న

రోడ్డు, సూర్యుడు నెత్తురు కక్కుతున్న రోడ్లు, కళ్ళల్లో దుమ్ము చల్లే రోడ్లు మనని చుట్టు కుంటాయి ఈ రెంటినీ - శిథిల శరీరాలనీ, విధ్వంస పరమైన రోడ్లనీ - విడదీయడం కష్టం (బద్దలైన శరీరం, తునకలైన భాష, ప్రేతాత్మాలాపనల సందిగ్ధంలో నిండిన రోడ్డు - ఈ మూడు ''నిజాలు'' అజంతా రచనల్లోని ఒక మౌలికమైన విషయాన్ని సూచిస్తాయి శరీరం, రోడ్డు, భాష సంప్రదాయకంగా దైవ/మానవ అస్తిత్వానికి, గమ్యానికి, ఆశ్రయానికి పాతుకుపోయిన నిజాలు / ప్రతీకలు. అజంతా ఈ మూడింటినీ తన దైనందిన బీభత్సంలో ముంచెత్తేయడంతో వారసత్వీకరించుకున్న అస్తిత్వాల పునాదుల్ని ప్రశ్నిస్తాడు, వాటిని కలవరపెడ్తాడు. అందుకే భవంతుల్ని, సౌరభాలను, హర్మ్యాలను (సంప్రదాయ ప్రతీకలుగా) జీవాశ్రయాలుగా కాక జీవచ్ఛవాలుగా, జీవహరిత యంత్రాలుగా చిత్రిస్తారు

అజంతా రచనల్లో రోడ్డుకి గమ్యం లేదు. '' ఆశలేదు, ఆస్కారం లేదు / ఫలానా రోడ్డు గమ్యం చేరుస్తుందనే సూచన ఎక్కడాలేదు''. ఈ రోడ్లు, శిథిల శబ్దశరీరాలతో ఆవరించి, వేర్వేరు విధాలుగా మన మీదకు వస్తాయి. నిజానికి మృతుల, ఖండితాంగ మానవుల గొంతుల ఆర్తనాదాలు వినిపించే ఈ వినాశకర యామాపథాలు - అజంతా తొలుచుకొంటూ వెళుతున్న స్వప్నలిపులే అజంతా రోడ్లు మన నగర వీధుల్లా మొదట్లో లేదా అక్కడక్కడా అగుపించినా అవి తటాల్న అంతుపట్టలేని చోట్లో స్వప్నలిపిలో అల్లుకుపోతాయి. స్వప్న బీభత్సాలకు అక్షరాకృతుల్నిస్తాయి మునిసిపల్ రోడ్లు మాత్రమే తెలిసిన వాడికి అగమ్య గోచరమైన ఈ రహస్తంత్రుల శబ్దమయంలో ఏం చేయాలో, ఎలా నడవాలో తెలవడం కష్టం. ఇదే అజంతా రచనలు పాఠకుడికి విసిరిన సమస్య లభ్యమయ్యే స్పందనా స్వరూపాలన్ని ఎదురైన వాస్తవాన్ని వర్ణించలేకపోతే ఏం చేస్తావు? ( ఏం చేయాలి? ) భిన్నమైన, అసంపూర్ణ వాస్తవం ఎదురైతే నీవు ఎలా స్పందిస్తావు? ( ఎలా స్పందించాలి? ) దాన్ని - అంటే ఎదురైన వాస్తవాన్ని పరివర్తింపచేయటం అంటే ఏమిటి? (What do you do with the given when all the available forms of response are inadequate - especially, when the given seems to confront with the fragmented, the incomplete - how do you respond? What does it mean to transform the given?)

3

మృత్యానుభవం అనేది ఏదైనా ఉంటుందా? ఉంటే దాన్ని రచించగలమా? అజంతా రచనల్లో ఇదొక అంతులేని సమస్య. అజంతా వాక్య పదీయాలు మృత్యానుభవ ఘర్షణలోంచి తొలుచుకుని వచ్చిన ఖండిత శబ్దాలు అంటే అతిశయోక్తి కాదు obsessive insistence తో మళ్ళీ మళ్ళీ కలబడే రూపచిత్రణ ఆర్తి గురించి ఆలోచిస్తే ఈ ఘర్షణ అర్థమౌతుందేమో. ఈ సంకలనం అంతటా మనను విడదీయకుండా వెంటొచ్చేది మృత్యుభాష శబ్దకళేబరాలు, మరణానంతర గొంతుకలు, ''మరణానంతరం కూడా మనిషిమాట్లాడుతూనే ఉంటాడు'', ''అస్థిక వికసిస్తున్న'' శబ్దాలు, నిషిద్ధాక్షరాల మీద నరబలులు, '' ఎర్రని గాయాలపై సూర్య కిరణాల చిత్రలిపి'', మృత్యు నిజాలు, మృత్యుగృహంలో నగ్నంగా నిలబడిన క్షతగాత్రులు, మరణానంతర స్వేచ్ఛాగీతాలు వేయిగొంతుకలలో మత్యుభాషను విస్తరిస్తాయి. ''కర్ఫ్యూ నీడలలో''ని సంభాషణలో తన ప్రాణహానికి భీతి చెందుతున్న వ్యక్తిని ఓదారుస్తున్న మాటలు జిల్లుమనే (Chilling) మృతభాష

అని మనకి క్రమేణ తెలుస్తుంది ''హిట్ లిస్ట్‌లో ఇక మన పేర్లుండవులే'' మొదట ఈ భ్రమా భరితమైన పూచీ ఓదార్పుగా వినిపిస్తుంది కానీ కవిత కదులుతుంటే ''మృత్యు ముద్ర అతిహతం'' అనీ, సంభాషిస్తున్న రెండు గొంతుకలూ సమాధి శబ్దాలేనని మనకు తెలుస్తుంది ''కారుణ్యాముఖి పృధ్వి అరచేతులలో భద్రంగానే ఉన్నాం గదా మనం ఇప్పుడు!'' ఈ ''ధైర్యం'' ఇచ్చే గొంతు వక్తకి ఒక పుష్పగుచ్ఛం ఇస్తుంది

మృత్యుభాష అంటే ఇక్కడ మృత్యుసూచన / మరణ వార్త కాదు మృత భాష కానీ, ఇంకా మృత్య భాష అనీ కూడా కాదు ఈ భాషలన్నీ, సంప్రదాయ ప్రతీకలో చెప్పాలంటే, వైతరణికి ఇటువైపునుంచి వచ్చేవే అంటే ఈ భాషల్లో మృత్యువు anthromorphize లేదా మానవీకరింపబడిన వస్తువు ఈ భాషలు కవిత్వీకరింపబడ్డ, లభ్య, శైలీకృత పరిభాష మాత్రమే అందుకే ఈ భాషలో అనుభవాతీతం చేయబడ్డ ఆశ్రయాలు కూడా దొరుకుతాయి వీటిలో సంలగ్న - సమగ్ర - వివరాలు, ఆది మధ్యాంతరాలు ఉన్న కథనాలు కనబడుతాయి. అజంతా లిపి లో(ని) మృత్యుఘర్షణని ఈ నిర్ధారిత ప్రమాణాల్తో కొలవడం అప్రయోజనం.

అజంతా రచనల్లో ఈ మృత్యు ఘర్షణ కనీసం మూడు రూపాల్లో మనకు తటస్థపడుతుంది దైనందిన జీవితంలో మృత్యువాతకు గురైన జీవిగా, స్వప్నాల్లో పీడకలగా, ముఖ్యంగా శరీరాన్ని చీల్చుకుని బయటపడే గొంతులుగా ఈ రూపాల మధ్య నిర్దిష్టమైన హద్దులు లేవు; అవి నిరంతరం, పరస్పరం చొచ్చుకుపోతాయి, పరివర్తితమవుతాయి ఇది వరకు చెప్పినట్టుల, ఈ రూపస్థానువుల్లో చాలా కొట్టొచ్చినట్టు మనకి కనిపించేవి. ఒకవైపున అంగవైకల్యం పొందిన శరీరాలు, భంగపడ్డ శరీరాలు, మరొక వైపు ఖండిత, ఖండ శబ్దశరీరాలు ఇక్కడ ముఖ్యంగా గమనించాల్సిందేమిటంటే రోగ గ్రస్తశరీరం, వేదనా దగ్ధ వ్యక్తిత్వమూ కేవలం బాధా దష్ట వస్తువులు కావు అవి ప్రాథమికంగా అవగాహనా కేంద్రస్థానాలే. పదాలు ఒట్టి పదాలు కావు; ఏదో హేతుపూర్వ క్రమాలు, ఐంద్రిక క్రమాలు కావు. అవి నిజానికి చర్యా ప్రేరకాలు - ఆ చర్య నించి వాటికి పూర్తిగా విముక్తి లేదు. పదాలు / భాష వస్తువు అవుతుంది. అవే చర్యకి కారకమవుతాయి. కారక పాత్ర బాధిత పాత్ర ఒకే 'స్థైర్య' బుద్ధిలో వికల శరీరాలలో అభివ్యక్తమవుతాయి. కల్లోల, ఖండిత భాషలో వ్యక్తమవుతాయి అజంతా రచనలో అదే ఒక జీవన పథం. (The afflicted body and the tortured self are not merely the objects of suffering; they are primarily the centre or cognition itself. Words are not just words, bearers or some rational or sensuous processes but really the perpetrators of action - an action from which they are never sufficiently freed. Words / language form (s) the object and agent of action. This double structure of agent and victim in the "same", manifesting in the forms of fragmented, mutilated bodies and disrupted, amputated language, is eminently a way of living in Ajanta's writing.)

''రోడ్డు మీద నా మృత కళేబరాలను నేనే లక్షసార్లు చూశాను'' అంటాడు వక్త ఒక కవితలో. ఇంకొక కవితలో పేపర్ చదువుతున్న వ్యక్తి (కవితలో మాట్లాడుతున్న గొంతుక) ఆ పేపర్ లోని అమానుషత్వానికి క్రమంగా లొంగిపోయినట్టు, ఆ పేపర్ Virus తనను మొత్తంగా

ఆక్రమించుకున్నట్టు కనిపిస్తుంది. దాని పరిణామమే: ''నా చేతులనిండా ముళ్ళు, ముళ్ళు / నా వేళ్ళ పొడుగుగా సూదులవలె దూసుకొస్తున్న ముళ్ళు''. ఈ అమానుషత్వానికి ఏదో స్పష్టంగా నిర్దిష్టమైన కారణం లేదా కారకం కానీ, అదిరాసే లేదా మాట్లాడే వానికి దూరంగా ఉన్నట్టు చూపించదు స్వప్నలిపి జరిగేది, జరిపించేది, జరిగేదాన్ని ఓదార్చి సహించేది అంతా మనం భ్రమిస్తున్న రోడ్డు / భాషల వక్రరేఖలమీదే అని సూచిస్తారు అజంతా ''డేట్‌లైన్‌హైదరాబాద్'' కవితలో గల్లీలో చిత్రవధకు గురైన శరీరానికి (''నన్నెవరో కాళ్ళతో త్రొక్కేశారు, నన్ను కత్తులతో పొడిచారు, కాళ్ళు చేతులు నరికేశారు'') తనకు తెలియని వాళ్ళు వాళ్ళకి తెలియని తనను చంపేశారని మాత్రమే తెలుసు. దీనికి కారణం తెలియదు ఈ శరీరంలో ప్రేతగాత్రం వక్త నుంచి అన్ని అంగాలు అరువు అడుగుతుంది తన భార్యా బిడ్డల్ని వెదుక్కోవడానికి. కానీ వక్త కళ్ళని ప్రేత నిరాకరిస్తుంది. ఆ ప్రేత లాగే అంగ విహీనుడైన వక్త తన చుట్టూ జరిగే ఖడ్గ ప్రళయాన్ని చూట్టానికి శాపగ్రస్థుడిలా నిలదీయబడుతాడు ప్రేతగాత్రానికీ జీవి గీతానికీ అంతరం, భేదం మారుతూ ఉంటుంది

స్వప్నలిపి మొత్తాన్ని మృత్యు ఘర్షణకి రూపం ఇచ్చే ప్రయత్నంగా వివరించవచ్చు. వ్యక్తా వ్యక్తరూపాలు, స్వప్నలిపిలోంచి తేలిరావడం మనం నిరాకరించలేము. మళ్ళీ గమనించాల్సింది ఏమిటంటే ఈ రూపాలన్నీ శిథిలమైనవే. ఇవన్నీ భగ్న ముఖాలు, గాయపడిన భాగాలు, చిట్లిన కపాలాలు. కానీ విచిత్రం ఏమిటంటే రచయిత ప్రతీ ప్రయత్నం ఇక్కడ ఈ యత్న పరిధుల్ని రచయితఅభిమతా (intentions)న్ని మృత్యుఘర్షణలో చిక్కిన ప్రతీ రూపాన్నీ తన ప్రతిరూపంగానే చూపిస్తుంది. (''నడుస్తున్న ప్రతి మనిషీనన్ను ప్రతిబింబిస్తున్న వాడే'', '' ఇదేం విచిత్రం ఇద్దరిదీ ఒకే పోలిక'' ''అంతదాకా దేనికి, రోడ్డుమీద నా మృత కళేబరాలను నేనే లక్షసార్లు చూశాను''). అంటే ఇక్కడ ఒకవిధమైన అంతులేని ప్రతిబింబత్వం (reflexivity) ''తన'' రూపాంతరాలను ప్రదర్శిస్తుంటుంది ఈ అగాధంలో ''అజంతా'' కూడా ఒక నిరంతర రూపాంతరం చెందే భగ్న పద చిత్రం మెలితిరిగిన ప్రతిబింబాలకి అజంతా తనలో తొలిచే, మలచే భాష కంటే వేరే నిదర్శనం లేదు. స్వప్నలిపిలోని భాష, భాషకున్న ప్రాతినిధ్య లక్షణానికీ, వ్యక్తమైన సమాచారానికీ మధ్య ఉన్న విభాగాన్ని తోసివేస్తుంది కల్లోలపరుస్తుంది. ఇది అజంతా అద్భుత విజయం (Stunning achievement).

సంప్రదాయికంగా భాషా భావనల మధ్య సంబంధాన్ని ఒక యాంత్రికమైనదిగా చూపిస్తారు ఈ బంధాన్ని రచయితనుండి పాఠకుడికి బదిలీచేసే వాహకంగా పరిగణిస్తారు అర్థానికీ/ వివేకానికీ ఉన్న పూర్వత్వను రచయిత మనస్సుతోకాని, అభిమతంతో కాని ఐక్యం చేస్తారు తద్వారా రచయితకు ఉన్నతమైన సర్వజ్ఞస్థితిని, గౌరవాన్ని స్థిరపరుస్తారు. (This anteriority of meaning / sense is identified with or located in the intention or mind of the writer. This assigns the writer a supreme, all knowing position of privilege) కవి / రచయిత కూడా, in turn, తనను తానొక పరికరంగా, వాహకంగా పరిగణిస్తూ ఏదో non-material transcendental source (అభౌతిక, సర్వోత్కృష్ట, సర్వశ్రేష్ఠ పథాన్ని) పవిత్రం చేస్తుంటాడు.

''స్వప్నలిపి'' ఖచ్చితంగా suspend చేసింది ఈ ముందు వెనకల సంబంధాల్ని అందుకే అజంతాలో పరంపరల ప్రస్తావన గానీ, ఆరుద్ర లాంటి anxiety గానీ, కాందిశీకుడు కావాలనే కాంక్ష గానీ కనబడవు శ్రీ శ్రీ, రావిశాస్త్రి కవితలలో కూడా ఏదో పూర్వీకులను revoke చేస్తున్న piety లేదు ''వాళ్ళు'' కూడా రూపాంతరం చెందుతారు అజంతా లిపిలో 'రావిశాస్త్రి' ది ఖడ్గచ్ఛాయలలో లక్షర తాండవం, కదంత్రొక్కుతున్న శబ్ద హయహేష (మళ్ళీ శబ్ద శరీరాల ఘర్షణే) 'శ్రీ శ్రీ' ది ''మంత్రశబ్దం'' - అచేతన (inanimate)ని చేతన (animate) గావిస్తుంది జడప్రాయుల్ని నిద్రలేపుతుంది క్షతగాత్రుల్ని పురికొల్పుతుంది ''శిరస్సు తెగిన మనిషి''కి చూపునిస్తుంది కానీ ఈ కవితలో నుంచి మనకు కవిపించేది ఆ మంత్ర శబ్దం కాదు - The absence or disappearance of it ''ఈ లోగా నిశ్శబ్దం, నిశ్శబ్దం మీద నిశ్శబ్దం'' అందే నిశ్శబ్దానికి శబ్దరూపాన్ని ఇచ్చే ప్రయత్నం - శ్రీ శ్రీ ఈ ప్రయత్నంలో కూడా శ్రీ శ్రీ క్రమేణా రూపాంతరం చెందుతాడు స్వప్నలిపి అంతరాల్లో పూర్ణ పరివర్తనవుతాడు. ఆఖరికి ఆయన ''అజంతానా'' లేక ''శ్రీ శ్రీ'' యేనా?। This remains undecidable

''స్వప్నలిపి'' మనకిచ్చే కఠిన సత్యం ఏదైనా ఉంటే అది మృత్యుఘర్షణ లేదా మృత్యానుభవం ఒక ఇతివృత్తం (thematic object) గా, ఒక వస్తువుగా ప్రదర్శించడం ఒక విధంగా బాధ్యతా రహిత భోగమె ఇందులో కించిత్తుకూడా risk (విపత్తు) లేదు. ఇలాంటి ప్రక్రియలో నిర్ధారిత వస్తువుగా ఎంచుకొన్న విషయాన్ని అందించడానికి, ప్రయాణించడానికి భాష ఒక నిష్క్రియ ఉపకరణం లాగా పనికొస్తుంది చెప్పదలచుకొన్నదానికి, (ఇచ్ఛ, విషయము, ఉద్దేశ్యం, వస్తువు) రూపానికీ మధ్య ఉన్న నిరాసక్త సంబంధం అజంతా కృతిలో తల్లకిందులవుతుంది, తొలిగిపోతుంది. స్వప్నలిపిలో తన శరీరాన్ని మృత్యు ఘర్షణకి క్షేత్రంగా కవి ఒడ్డుతాడు ఇక్కడే మృత్యానుభవానికి లక్షలులిచ్చుమోస్తాడు బీభత్సం ఇక్కడ కథావస్తువుకానీ, ఇతివృత్తం కానీ కాదు. బీభత్సం నిజంగా రూపాంతరిస్తున్న స్వప్నలిపే, పూర్ణ పరివర్తన (metamorphose) అవుతున్న శబ్ద హింసాకృతులే

ఆశ్చర్యం ఏమీలేదు ఇదివరకన్నట్లే, స్వప్నలిపిలో ఆదిమధ్యాంతాలున్న కధాకథనాలకు తావులేదు. మరి, మృత్యువే కదా అన్ని పొందులనీ, పొందికలనీ, సంగ్రహాలనీ, గాథల పరంపరలనీ దుర్భరం చేసేది! ఆ ''అనుభవాన్ని'' క్రమబద్ధం చేయడం ఒక అసంభవ చాపల్యంకదా? కానీ విచిత్రమేమిటంటే ప్రపంచంలో ఒకే ఒక కఠోర సత్యాని (continuous existence)కి నిరంతర జీవనం ఉంది అదే మృత్యువు మృత్యువును తప్పించుకోలేని వాస్తవం అందుకేకావచ్చు ''మిత్రుడా మృత్యువు ప్రాణరహస్యం ఎక్కడో చెప్పగలవా'' అంటాడు వక్త ఒక చోట. ఈ అడ్డదిడ్డంగా repeat అయ్యే వినాశనాలే స్వప్నలిపిలో మనం ఎదుర్కొంటాం ఈ వినాశనానికి లోబడి శిథిలమైన, తుడిచిపెట్టుకుపోయి, గుర్తులేకుండా పోయిన వారికి రూపాకృతులు మలిచే ప్రక్రియే అజంతా నిత్య జీవితం కానీ అత్యంత సందిగ్ధమైన ఈ రూపాకృతులు, అవి పొందే మార్పులు, అవి సూచించే నిజాలు అజంతాను ఆయన ప్రక్రియా జీవనం నుంచి దూరం చేయలేవు. అందుకే అజంతా ఒక తాత్వికుడనో, వేదాంతి అనో అంచనా వేసేవారు ఆయన రచనల్ని అవగాహన చేసుకోకుండానే, అసహనంతో ఆయనపై ముద్రలు వేస్తున్నారు (సశేషం)

# తెలుగు నేలపై నవలకు స్థానం ఉందా?

- నరేష్ నున్నా

తెలుగులో నవల గురించి ఇటీవలి కాలంలో చర్చ జరిగింది కొన్ని పత్రికలలో, ముఖ్యంగా 'ఆంధ్రప్రభ' సాహిత్య అనుబంధ పేజీలలో నవల ప్రస్తుత స్థితిగతులగురించి చర్చ సాగింది తెలుగు నవల పునర్వికాసాన్ని(?) ఉద్దేశించి శ్రీ కల్లూరి భాస్కరం చర్చకు నాంది పలికారు సీరియస్ రచయితలమని అనుకున్న వారిలో ఆ సీరియస్‌నెస్ కనిపించికపోవడం వల్ల, వారి రచనలకు బొత్తిగా రీడబిలిటీ లోపించడం వల్ల 'వారి కంటే కమర్షియల్ రచయితలు మేలుకాదా?' అని కల్లూరి వ్యాఖ్యానించారు కల్లూరి వ్యాఖ్యలు తమ రాతల పట్ల కితాబులుగా భావించి యండమూరి, మల్లాది, మైనంపాటి వంటి కమర్షియల్ రచయితలు కూడా చర్చలో భాగం పంచుకున్నారు (నిన్నటి తరం) మంచి నవలారచయిత నవీన్ (అంపశయ్య) ఉద్దేశంలో 'తెలుగులో మంచి నవలలు రాలేదని అనడం అంటే, వస్తున్న నవలలపై శీతకన్ను వేసి మాట్లాడటమే (నట)' కొన్ని వారాల (బహుశా నెలల) పాటు సాగిన ఈ చర్చపై నా ప్రతిస్పందనగా ఇది రాస్తున్నాను

ముందుగా, ఈ వ్యాసం రాయడానికి నన్ను ప్రేరేపించిన మరో సంఘటనను కూడా ఇక్కడ ప్రస్తావించడం అసందర్భం కాదనిపిస్తోంది అందరూ గౌరవంగా ' ఎం టి ' అని పిలుచుకునే మళయాళీ మహారచయిత, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఎం టి వాసుదేవనాయర్ కొద్ది నెలల క్రితం హైదరాబాద్ వచ్చారు. తాను లాటిన్ అమెరికన్, ఆఫ్రికన్, యూరోపియన్ వచన రచనల్ని చదవగలుగుతున్నానే గానీ, పక్కనే ఉన్న ఆంధ్రదేశం నుంచి వస్తున్న రచనలను చదివే అవకాశం కలగడం లేదని, అనువాదానికి సంబంధించి చాలా వెనకబడి ఉన్నామని బాధపడిపోయారాయన ఆయన బాధనలా ఉంచితే, అనువాదకుల కరవుతో బైట ప్రపంచాలకు పరిచయం కాక ఎంత నష్టపడిపోతున్నామోనని తెలుగు సాహిత్యలోకం ఖేదించిన అనేకానేక సందర్భాలలో అదీ ఒకటి ఎన్ని జ్ఞానపీఠాలు, ఎన్నెన్ని బుక్కర్, నోబెల్ బహుమానాలు అల్లంత దూరానే తప్పుకుపోతున్నాయోనని తెలుగు రచయితలు మరోసారి దిగులు పడ్డారు. అంతేగాని, ఇతరేతర ప్రాంతాలకు ప్రసారం కావడానికి అర్హమైన వచన రచనలు ముఖ్యంగా నవలలు పుడుతున్నాయా అన్న ఆత్మ పరిశీలనకు ఏ రచయితా పూనుకోలేదు అలా ఆత్మపరిశీలనకు పూనుకోకపోవడానికి గానీ, వాడిగా వేడిగా జరిగిన నవలపై 'చర్చా సమరం' - సమస్యపైన అర్థ వంతమైన వెలుతురు రేఖను ప్రసరింపజేయకపోవడానికిగానీ తెలుగు కలాలలోని మౌలికసంస్కారలేమి, దృష్టిమాంద్యాలే కారణమని నా ఉద్దేశం. నా ఉద్దేశాన్ని ఒక 'ప్రతిపాదన' చేయడమే ఈ వ్యాస లక్ష్యం

★ ★ ★

ప్రపంచ వ్యాప్తంగా 'కవిత్వం' ప్రాచీనకాలంనుండి ఉన్నదేగాని, 'వచనం' ఆధునికత అందించిన వరం డాంటే **devine comedy,** వ్యాసుని 'మహాభారతం'లలో కథ ఉంది గాని, నేరేషన్‌కు 'కవిత్వాన్నే' కదా మాధ్యమంగా ఉపయోగించారు. కవిత్వం - ట్రూత్ నుండి ప్రొఫౌండర్ ట్రూత్'కు ప్రయాణమైతే, వచన ప్రక్రియ ముఖ్యోద్దేశం 'వాస్తవికత నుంచి సత్యాని'కి పయనించడమే. ప్రపంచ ప్రఖ్యాత నవలా రచయిత లియోటాల్‌స్టాయ్ తన కథలలో ప్రధాన పాత్ర సత్యానిదే అంటాడు. **(The hero of my tale, whom I, love with all my heart and soul, whom I had tried to depict in all his beauty, and who always was, is and will be beautiful - the truth)**

అయితే, వచనం - 'ఆధునికత అందించిన వరం' అనడం ఎంత సమంజసమో, అదే వచనం - 'రచయిత పాలిట ఆధునికత విధించిన శాపం' అనడం కూడా అంతే సమంజసం ఎందుకంటే, 'కవిత్వం' విషయంలో మోసానికి ఆస్కారముంటుంది గానీ, వచన రచనకు ఆ 'సౌలభ్యం' లేదు కనుక (తాత్కాలికంగానైనా) మనల్ని భ్రమకు లోనుచేసే కవులు ఉంటారు గానీ, వచన రచనలో ముఖ్యంగా నవలా రచయితలలో 'మోసకారి రచయితల'కు స్థానం లేదు కవిత్వం 'చూడబడేద'యితే, వచనం 'చూసేది' ( ఏకకాలంలో చూసేది, చూడబడేది అయినటువంటి వచనం రాయగల త్రిపుర, బుచ్చిబాబు వంటి వచన రచయితల గురించి, చూడబడేది, చూసేది అయిన కవిత్వం రాసే 'మో', సిద్ధార్థ వంటి కవుల గురించి కాసేపు విస్మరిద్దాం) ప్రాచీన భారతం రాజకీయంగా ఒకే గొడుగు నీడనలేకున్నా భావోద్వేగాలలో భిన్నప్రాంతాల మధ్య సారూప్యత కలిగి ఉంది అందుకే ప్రాచీన భారతీయాత్మ ఏభాషలో అయినా, ఆ భాషావాఙ్మయమైన 'కవిత్వం' లో దాగుంది. 'మార్మిక వ్యామోహమనే సారూప్యత కలిగి ఉండటానికి కవులు ఎక్కువగా ఒకే వర్ణానికి చెందిన వారు కావడం కూడా కారణం కావచ్చు వర్తమాన భారతం భౌగోళికంగా ఏకమైనప్పటికీ, భిన్నప్రాంతాల భావ పరిణామం వైరుధ్యభరితంగా ఉంది ఈకారణం చేత ఆధునిక భారతీయ సాహిత్యాత్మ ఏ ప్రక్రియకు ప్రధానంగా ప్రాతినిధ్యం వహిస్తుందో సాధారణీకరించి చెప్పడం కష్టం తెలుగుదేశానికి సంబంధించినంత వరకూ అన్ని ఆధునిక దశలలోనూ కవిత్వానిదే పెత్తనం తెలుగులో ఏ సాహిత్యోద్యమాలకైనా కవిత్వంలో మార్పులే భూమిక కావడాన్ని గమనించవచ్చు వివిధ సాహిత్యోద్యమాల credibility ని తేల్చుకునే సాహిత్య చరిత్రకారుడు కవిత్వానికి సంబంధించి పైన పేర్కొన్న 'సౌలభ్యాన్ని' కూడా గుర్తించవలసి ఉంటుంది దానినలా ఉంచితే, ప్రస్తుతం ఆధునిక, ఉత్తరాధునిక చర్చలు చేస్తున్న సాహితీవేత్తలు కూడా కవిత్వాన్నే రిఫరెన్స్‌గా తీసుకుంటున్నారే తప్ప 'వచనం' జోలికే పోకపోవడం గమనార్హం ఆధునిక యుగం పురిటిదశలో చలం, త్రిపురనేని గోపీచంద్, అడవి బాపిరాజు, జి వి.కృష్ణారావు వంటి వారి తర్వాత కనీసం అర్ధశతాబ్దిగా ఏర్పడిన అగాధాన్ని చూస్తూ కూడా 'ఆధునికత' ఆంధ్రదేశంలో పుట్టీపుట్టని పసికందుగానే మృతశిశువు అయిందని తెలుగు విమర్శకులు గ్రహించకపోవడం మరీ ముఖ్యంగా గమనార్హం ఆధునికవాదమన్నది 'వలసవాదా' నికి పర్యాయపదమని కత్తులు నూరుతున్న ఉత్తరాధునికుల వాదనలో పస సంగతి ఎలా ఉన్నా, తెలుగు సాహిత్యంలో ఆధునికత మొగ్గదశలోనే రాలిపోయిందని నవలా 'వికాస చరిత్ర' తేటతెల్లం చేస్తుంది

భూగోళం మీద భిన్న కవళికలు వున్న మనిషి స్థితిని అర్థం చేసుకోవటానికి, భిన్నపార్శ్వాల సమాహారమైన జీవిత చిత్రణకు (అంటే చూసేందుకు) ఉద్దేశించినదని నవలను స్థూలంగా నిర్వచించుకుంటే, నవలా రచయితకు సగటు 'దృష్టి' ఉంటే సరిపోదు అంతర్దృష్టి ఉండితీరాలి తెలుగులో నవల ఎందుకు కనుమరుగయిందన్న ప్రశ్న సంధించిన కల్హారి 'మౌలికత' ను విడిచి పెట్టి జవాబు వెదికారని నా ఉద్దేశం. ఈ తెలుగునేలపైన ఆధునికత వికసించకపోవడానికి, పైన పేర్కొన్నట్టు తెలుగురచయితకు దార్శనిక శక్తి కొరవడటానికి కారణాలను ఆ 'మౌలికతే' విశ్లేషిస్తుంది. తన కుమార్తె అలెగ్జాండ్రియాకు టాల్‌స్టాయ్ ఒకానొక సందర్భంలో ఒక లేఖ రాస్తూ 'To live an honest life one must plunge in to things, get involved, entangled, make mistakes, give up and start again, then give up yet again but keep on fighting and suffering' అని అంటాడు. ఇటువంటి అనుభవం, జీవితంతో ప్రయోగాలు చేసుకోగలిగిన తెగువ, ఉపరితలానికి కనిపించే ప్రపంచం ఆంతర్యాన్ని అర్థం చేసుకోగలిగిన 'విజన్' . కరవైతే

నవల పుట్టడం అసంభవం. ' ఆలోచన' ఇగిరిపోవటం వల్ల మేధోవచనం (Intellectual prose) ఎలా ఊరదో, 'అనుభవం' లేకపోతే సృజనాత్మక వచనం (creative prose) అలా పుట్టదు మన పరిసర రాష్ట్రాలైన తమిళనాడులో ఉన్న రాజకీయ విప్లవ స్పృహ గాని, కర్నాటక, కేరళలో ఉన్న సాంస్కృతిక విప్లవ స్పృహ గాని, మహారాష్ట్రలో ఉన్న సామాజిక విప్లవ స్పృహ గాని తెలుగు నేలకు లేవు. అందుకే మనకు తకిరి శివశంకర పిళ్లై, వైకం మహ్మద్ బషీర్, మాధవి కుట్టి ( కమలాదాస్), ఉరూబ్, విజయన్, ఇందిరా పార్థసారధి, శివరామ కారంత్, యు ఆర్ అనంతమూర్తి, వి ఖండేకర్ వంటి నవలా రచయితలు గానీ, వరేర్కార్, విజయ్ టెండూల్కార్, కిరణ్ నడేకర్, గిరీష్ కర్నాడ్ వంటి నాటక రచయితలు గానీ ఉండరు - ఉండే వీలులేదు.

ఇకపోతే, 'పాపులర్, సీరియల్ రచనల' వర్గీకరణతో జరిగే చర్చ అనవసరమని నా అభిప్రాయం ఇంచుమించు 70వ దశకం వరకు నవల మెయిన్ స్ట్రీమ్ సాహిత్యంలో భాగంగా ఉండి ఆ తరువాత కమర్షియల్, పాపులర్ ఎందుకు అయిపోయిందని కొందరి వాదం నిజానికి వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్రము' నుండి కూడా మనకు 'నవల' ఔట్‌సైడరే మధ్యలో మనం పారేసుకున్నది ఏమీ లేదు తెలుగువారి సహజాత నిర్లిప్తాన్ని వచనంతో వేటు వేయడానికి ప్రయత్నించిన మంచి రచయిత విశ్వనాధ సత్యనారాయణ. రాసిలోను, వాసిలో కూడా ఆయన మంచి రచనలెన్నో చేసినప్పటికీ, తన బ్రాహ్మణ్య భావ ప్రచారానికే వాటిని వినియోగించడం వల్ల నవలను తెలుగు వాడి ఆత్మగతం చేయడంలో ఆయన విఫలమయ్యారు వడ్డెర చండీదాస్ మాటల్లో చెప్పాలంటే 'తెలుగుదనం కూపంలో ఇమడలేక పోయిన' బుచ్చిబాబు అందులో నుండి బయటపడేందుకు చేసిన ప్రయత్నంలో భాగంగానే రాసిన కారణంగా 'చివరికి మిగిలేది' కూడా మనకు ప్రవాసంగానే ఉండిపోయింది అందుకే ఒకటి రెండు నవలలు మినహాయించి మనవి అని చెప్పుకొనేందుకు ఏమీ లేవు మనలోని సామాజిక, సాంస్కృతిక నిర్లిప్తతను పుణికిపుచ్చుకున్న రచయితలే ఎక్కువ కావడం వల్ల 'నవల' అనే సాహితీ ప్రక్రియ తెలుగు పాఠకులకు దూరమైపోయింది

ఇక pulp literature ఏ భాషలోనూ లేకుండా పోలేదు వేయి నవలలు రాసిన 'కొవ్వలి' స్థానం ఏమిటన్న దానిపైన తర్జన భర్జన పడటం హాస్యాస్పదం. జాన్‌పాల్‌సార్ర్త్ ప్రతిపాదన ప్రకారం మనిషి అస్తిత్వంలో 1. being in itself, 2. being for itself, 3. being for others అనే మూడు పార్శ్వాలుంటాయి. ఈ మూడింటిలో దేని ప్రాబల్యం ఎక్కువయితే, ఏ పార్శ్వం ప్రామాణికంగా నడుచుకుంటామో దానికి అనుగుణమైన వ్యక్తిత్వాలే రూపుదిద్దుకుంటాయి. 'పరుల దృష్టిలో తానేమిట'న్న నిరంతర ఆలోచనతో ( మూడవ ఫేజ్) మునిగి తేలే వ్యక్తులు అంతటా పెరిగిపోవడాన్ని రూసో తరమే గుర్తించింది. 'దాత' అని పేరు పొందినవాడు, దాతగా అందరి కంట్లో నిలవడానికి అలవరచుకోవలసిన స్వాతిశయం, కపటత్వం, అబద్ధం వంటి గుణాలన్నీ ఈ కమర్షియల్ సాహిత్య కారులకు ప్రాథమిక లక్షణాలవుతాయి. పాఠకుల/ అభిమానుల అభిరుచి, దృష్టిలోనుంచే మాత్రమే ప్రపంచాన్ని చూడటాన్ని అలవాటు చేసుకుంటారు. ఇక్కడ 'I' (నేను) లో నిజాయితీ లోపిస్తుంది. 'స్రవంతి', 'మందాకిని', 'హ్యూమరాలజీ' వంటి రచనలు, మోడస్టీ కోసం చెప్పుకోకుండా యండమూరి దాచుకున్న 'రుషి', 'పర్ణశాల', 'ఆనందో బ్రహ్మ' వంటి నవలలకు సాహిత్య గౌరవం ఎందుకు దక్కదో పై వివరణే సమాధానం.

మరి కొంత వివరంగా చెప్పుకోవాలంటే, మల్లాది, యండమూరిలను ఒక గాటన కట్టడం కూడా తప్పే. ఎందుకంటే, మల్లాదికి మంచి రచనలకు సంబంధించిన అవగాహన లేకపోయినా, తన రచనల లక్ష్యమేమిటో, వాటి ప్రయోజనం ఏమేరకో ఒక స్పష్టమైన అవగాహన ఉంది. కానీ,

హిస్టరీ, ఆంథ్రోపాలజీ, సైకాలజీ, లిటరేచర్ వగైరా రంగాలన్నింటి గురించి ఆయా రంగాలకు సంబంధించిన ప్రముఖుల పేర్లను ఉటంకిస్తూ superficial గా మాట్లాడటం యండమూరి దుర్ల క్షణాలలో ఒకటి ' ఆమెకు జేమ్స్ జాయిస్ గుర్తుకువచ్చాడు పురుషుడు స్త్రీ కోసం వివాహాన్ని అంగీకరిస్తాడు ...' తరహా కోటేషన్ సహిత వ్యాఖ్యలు, మానసిక, తాత్విక విశ్లేషణలు యండమూరి ' ఈజ్' రచనలో కోకొల్లలు నాకు తెలిసి యండమూరి చాలా సందర్భాలలో సార్త్రేను ప్రస్తావించారు. సార్త్రేను చదివిన రచయిత ' ఏ రచయితైనా ఎందుకు రచనలు చేస్తాడు? డబ్బు వల్ల వచ్చే ఆత్మ సంతృప్తి వల్ల ' అంటూ అమాయకంగా అనగలరా? రోజు రోజుకూ చిక్కనవుతున్న సంక్లిష్టత మూలాలను అర్థం చేసుకోవడాని, ఆ ప్రయత్నంలో తాను మరింత clarify అయ్యి, పాఠకుడితో పంచుకోవడానికే ఆధునిక రచయిత రాస్తున్నాడు ఆ ప్రయత్నంలో కొత్త భాషకోసం తపస్సు చేస్తున్నాడు (దాదాపు దశాబ్ద కాలం పైగా కొత్తగా వస్తున్న ఆఫ్రికా, లాటిన్ అమెరికా వచన సాహిత్యమే ఇందుకు తార్కాణం). ఈ ప్రాధమిక విషయాలు కూడా తెలియకుండా, సాహిత్య చర్చకు సిద్ధమవడం, సమకాలీన సాహిత్యం మీద తీర్పు వెలువరించడం యండమూరి దోషాలు సీరియల్ నవలల పోటీకి సంబంధించి సవాల్ విసురుతున్న యండమూరిలో తమ ప్రతిభావిశేషాల మీద ఉన్న నమ్మకాన్ని చూసి నవ్వుకోవాలే గానీ, ఉక్రోషపడనక్కరలేదు. కమర్షియల్ సాహిత్యమే తమ ప్రధాన ప్రత్యర్థిగా భావించిన ఎంతో మంది తెలుగు బలహీన రచయితలకు యండమూరి సవాల్ తగినదేనేమో అరిస్టోమేక్లిన్, హెరాల్డ్ రాబిన్స్ వంటి పాశ్చాత్య కమర్షియల్ రచయితలకు తమ పరిమితులు ఎంత స్పష్టంగా తెలుసో, లారెన్స్, డికెన్స్, టాల్‌స్టాయ్ వంటి మహారచయితల విశాలత్వమూ అంతగా తెలుసు అటువంటి స్థాయీ భేదాలు తెలియని యండమూరి వంటి వారు సవాళ్లు విసిరేదశలో ఉండటం కంటే తెలుగు వచన సాహిత్య దుస్థితికి వేరే ఉదాహరణ ఎందుకు? తామేమి రాస్తున్నారో తమకే అర్థం కాని స్థితిలో ఉన్న యండమూరి లాంటి వారికి, అదే స్థితిలో ఉన్న సోకాల్డ్ సీరియస్ రచయితలకు భేదమేముంది?

మళ్లీ కల్లూరి వ్యాసం దగ్గరకు వెళ్తే, ఆయన తన వ్యాసంలో ప్రశ్నను నిలబెట్టడంతో తన బాధ్యత తీరినట్టుగా భావించకపోవడం సంతోషించదగినదే. ప్రశ్నకు జవాబు వెదికే ప్రయత్నంలో భాగంగా ఆయన తన వ్యాసంలో ఆత్మాశ్రయ, వ్యస్త్వాశ్రయ చర్చకు ఎక్కువ స్థానం కేటాయించారు అయితే ఆత్మాశ్రయత, వస్త్వాశ్రయతలను అర్థం చేసుకోవడంలో ఆయన పొరపడ్డారేమో అనిపిస్తుంది ఈ సబ్జెక్టివిటీ, ఆబ్జెక్టివిటీలను చర్చించే ముందు ఒక్కమాట టాల్‌స్టాయ్ మెగ్నమ్ ఓపస్ 'వార్ అండ్ పీస్' లో కథానాయిక నటాషా `I can see, how you are able to describe land owners, generals, soliders, but how you can get in to the heart of a girl in love' అని ఆ నటాషా పాత్ర రూపకల్పనపై టాల్‌స్టాయ్‌ని ఆయన మరదలు టాన్యా ప్రశ్నించింది. ఫ్రాయిడ్‌కు ముందు, మనోవిజ్ఞాన శాస్త్రం కొత్తగా రేకులు విచ్చుకున్న 20వ శతాబ్దం ముందే టాన్యా ఈ చిక్కు ప్రశ్నను టాల్‌స్టాయ్‌కి సంధించింది ఆధునిక సాహిత్యం అనుభవాత్మకమే గానీ, ఊహాజనిత, కల్పనాభరితం కానేకాదని టాన్యా చెప్పకనే చెప్పింది ఆధునిక మనోవిజ్ఞాన శాస్త్రంకూడా 'మనిషి' కి పరిమితులు విధించింది ఎదుట మనిషి ఏ మేరకు పరిచయమవుతాడో, ఆ మేరకే 'పాత్ర' కూడా పరిచయం అవుతుంది తప్ప, అంతకుమించి వివరాలు రచయితకే తెలిసే అవకాశం లేదు. ఈ విషయం మనోవిజ్ఞానం శాస్త్రం చెప్పకముందే మహారచయితలు చెప్పేశారు. 'సీతయ్య నా సృష్టి .... పూర్తిగా నా చెప్పుచేతలలో మెలగవలసిన వాడు . .. సీతయ్య నా చేతిలో యంత్రం. నా హార్మోనియం, కేరమ్ బల్ల....' అంటూ తన (చరమ రాత్రి సంకలనం) కథలో పాత్ర గురించి శ్రీశ్రీ వంటి అహంకారి అనగలడు గానీ, ప్రపంచవ్యాప్తంగా ఏ మంచి రచయిత

అనలేకపోయాడు `I could viriualy hear what my characters say before I write it down' అని మహారచయిత చార్లెస్ డికెన్స్ అనడం వెనుక, ఆ పాత్రలు చెప్పకుండా దాచినవి తాను ఎన్నటికీ వినలేననే వినయం దాగుంది (అయితే, Time, space ల మధ్య చిక్కుకొని ఉన్న నవలను time, tense ల మధ్యకు స్థానభ్రంశం చేసి, 'యులిసెస్', 'ఫినిగన్స్ వేక్' అనే నవలల ద్వారా ప్రపంచ నవలా సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన మహా రచయిత జేమ్స్ జాయిస్, తెలుగుకు ఒకే ఒక ఈస్తటిక్ నవల 'హిమజ్వాల'ను అందించిన వడ్డెర చండీదాస్ ... ఇద్దరూ కూడా తమ పరిమితుల్ని దాటి 'ఆమె' అంతరంగిక చైతన్య స్రవంతిని పట్టుకునే ప్రయత్నం చేసిన దోషం నుండి తప్పుకోలేరు ) కనుక, పాత్రతో సంభాషణ చేయగలిగిన శక్తి వస్త్వాశ్రయలక్షణం ఇవ్వదు. ఆత్మాశ్రయలక్షణమే ఇస్తుంది ఒకే ప్రదేశం భిన్న ప్రపంచాలుగా, విభిన్న సమాజాలుగా చీలిన నేపథ్యంలో డికెన్స్ మూడువేల పాత్రలను సృజించినా, షేక్స్పియర్ అంతకుమించి జీవితాలను ఆవిష్కరించినా ఈ సబ్జెక్టివిటీయే కారణం అంత గతంలోకి కూడా అనవసరమే కేవలం రెండు మూడేళ్లక్రితమే మరణించిన మలయాళీ మహారచయిత వైకం మహ్మద్ బషీర్ తన వైవిధ్యభరిత రచనలలో ఎన్నో జీవితాలకు ప్రాణం పోయగలిగారంటే, ఆయన దేశదిమ్మరిగా, కూలీవాడిగా, విద్యార్థిగా, అధ్యాపకుడిగా విభిన్నమైన జీవితాలను జీవించడమే కారణం ఎకడమిక్‌గా నవల నిర్వచనంలోకి ఒదగని విధంగా చలం రాసిన 8 నవలలోను తొలి నవల (శశిరేఖ) లోని శశిరేఖ చివరి నవల (జీవితాదర్శం) లోని లాలసగా, తొలి నవలలోని నవజీవన దాసు చివరి నవలలోని దేశికాచారిగా చెందిన పరిణామాన్ని గమనించి, ఆయన నవలలన్నింటినీ ఒకే నవలగా గుర్తిస్తే, చలంలోని ఆత్మాశ్రయ లక్షణం మరింత ప్రస్ఫుటంగా అర్థమవుతుంది. భిన్న జీవితాలను తాత్వికంగా జీవించలేకపోయానన్న ఎరుక ఉండబట్టే బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' ఏదనే ఒకే ఒక ప్రశ్నతోనే తన నవలా వ్యాసాంగాన్ని చాలించారు. మధ్యప్రాచ్యం మీద పట్టుకోసం బ్రిటన్, ఫ్రాన్స్, టర్కీ, రష్యా జరిపిన Crimean war లో స్వయంగా పాల్గొని ఆ అనుభవాలనే Tales of Seveastopol గా పేర్చిన టాల్‌స్టాయ్, జీవితానికి, అనుభవానికి, రచనకి హద్దు రేఖలను చెరిపివేసిన గోర్కీ, దుఃఖోపహతుల మానసిక ప్రపంచాన్ని ఫ్రాయిడ్ కంటే ముందే కళానేత్రంలో దర్శించి crime and punishment గా ప్రదర్శించిన దోస్తొవిస్కీ, భయోద్విగ్న అంతరంగిక అస్తిత్వాన్ని తన మొత్తం సాహిత్య సృజన ద్వారా ఆవిష్కరించిన కాఫ్కా, `Man can be destroyed, but not be defeated' అన్న మహావిశ్వాస ప్రకటనచేసిన హెమ్మింగ్వే ఇంకా రచయితలందరిలోనూ ఆత్మాశ్రయ నివేదనే.

కథ (కొన్ని సందర్భాలలో) ఉత్తమ పురుషలో సాగినప్పటికీ, కథకుడు కేవలం Onlookerగా మాత్రమే ఉండి, ఒక seer లానో, saint లానో కథా వస్తువుకు అంటీ ముట్టకుండా, నీళ్లమీద నూనె తెట్టులా వ్యవహరిస్తూ కథను చెప్పే ప్రక్రియ వస్త్వాశ్రయతే (నిజానికి, ఆధునికవతకు వస్త్వాశ్రయత చుక్కెదురని నా అభిప్రాయం). తెలుగులో దానికి ప్రతీకగా నిలిచే రచయిత ఒక్క కొడవటిగంటి కుటుంబరావు మాత్రమే. బుద్ధిని, అది అందించే 'ప్రశ్న'ను మాత్రమే పనిముట్టుగా కలిగి ఉన్న కొ.కు., రచనకు రక్తమాంసాలు అందించే 'హృదయా'న్ని పూర్తిగా అలక్ష్యం చేశారు. మానవ వుద్వేగాలకు ఆయన పాత్రలు అతీతంగా వ్యవహరించి జీవలక్షణాలను కోల్పోయాయి సోకాల్డ్ 'వస్త్వా శ్రయత' వల్ల జరిగే నష్టానికి ఇంతకు మించి ఉదాహరణ ఉండకపోవచ్చు

చివరిగా ఒక్కమాట ప్రయత్నాలన్నీ విఫలమయ్యాక, ఏడుపును దిగమింగి, విదూషక వ్యవస్థను చూసి పగలబడి నవ్వవలసిన స్థితిలో ఉన్నామని అంటున్నారు కల్లూరి. కానీ, ఏ మహా ప్రయత్నాలు చేశామని - వైఫల్యానంతర పరాజిత స్థితి గురించి ముచ్చటించుకోవాలి.

# అగ్ని సరసున వికసించిన వజ్రం - కె.వి.ఆర్.

- శివలింగం

తెలుగులో మార్క్సిస్టు మేధావుల్లో కె వి. రమణా రెడ్డి గణనీయుడు 1998 జనవరి 15 ఉదయం మరణించి మార్క్సిస్టు సాహిత్య విమర్శకు తీరని లోటు కలిగించాడు. నిరంతర పఠనాసక్తి, అనితర సాధ్య రచనా వ్యాసంగం, సామాన్య జన శ్రేయోభిలాష, శ్రీశ్రీ మీద ఎనలేని, ఎల్లలు లేని, వల్లమాలిన అభిమానం - కె.వి. ఆర్ లో వున్న గుణాలు జీవితాంతం మార్క్సిజానికి నిబద్ధుడైన కవీ, విమర్శకుడు అలనాటి అభ్యుదయ సాహిత్యం నుండి విరసం వరకు క్రియాశీలిగా, కార్యోత్సాహిగా పెనవేసుకుని పనిచేశాడు. దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ, రాహుల్ సాంకృత్యాయన్, డిడికోశాంబి వంటి భారతీయ మార్క్సిస్టు ఉద్దండ పండితులు తెలుగు దేశంలో జన్మించలేదు అభ్యుదయ రచయితలు రష్యాకు, విరసం కవులు, రచయితలు చైనాకు మనసును, బుద్ధిని అర్పించిన వారే గాని జాతిజనుల గుండెల్లో నినదించే రచనలు చేయలేకపోయారు మార్క్సిస్టులు బహిర్ముఖులు. అందుకే కవిత్వం పట్టుబడలేదు మార్క్సిజమే సర్వస్వం అనుకొనే వారిని గురించి రాస్తున్నానని అర్థం చేసుకోవాలి ఆధునిక కవులు కందుకూరి నుంచి అందరి మీదా కె వి ఆర్ చేయిచేసుకున్నారు స్వేచ్ఛ అన్నా, గుండెల్ని పిండే ఉత్తమ కవిత్వమన్నా మార్క్సిస్టులకు మంట పెట్టినట్లుంటుంది కె వి ఆర్. మంచి కవుల కవిత్వాన్ని విమర్శించిన వ్యాసాలున్నాయి తిలక్‌లోని స్వాదుతత్వాన్ని గుర్తించినా, మార్క్సిస్టుగా జీవకారుణ్యం వుంది గనుక విమర్శించాడు. అడవి, అంగారవల్లరి, భువనఘోష, జైలుకోకిల, సూరీడు మావోడు కవితా సంకలనాలు వచ్చాయి. కవిత్వంలో రమణారెడ్డి పండిత భాషను ఎన్నుకున్నాడు అంగారవల్లరిలో లఘుటిప్పణి యివ్వాల్సివచ్చింది తనది abstruse poetry అన్నాడు.

గురజాడ మీద రాసిన 'మహోదయం' ఒక విజ్ఞాన సర్వస్వం అనడంలో సందేహం లేదు. విశేషకృషి చేసి వెలువరించాడు. శైలిని గురించి రా రా విమర్శచేశాడు. గురజాడ అభిమానులందరికీ యిది వెల లేని కానుక. రమణారెడ్డి గారి భాష పేరుకు వ్యావహారికమే అయినా ఆయన శైలి వ్యవహారానికి దూరమైన పదాలు విరివిగా వాడడమూ, వ్యవహారానికి దూరమైన వాక్యనిర్మాణం అతిగా అవలంబించడం లోపాలుగా పేర్కొన్నాడు. కె.వి.ఆర్‌ది అలంకారిక శైలి

పేదల పక్షం వహించిన కవికి వుండవలసిన స్పష్టత, క్లుప్తత కె.వి. ఆర్ లో లేవు. పండిత భాష, సంస్కృత సమాసాలు కూడా అధికంగా వుంటాయి. మార్క్సిస్టు పదుగురికి అర్థమయ్యే రీతిలో రాయాలి. శ్రీశ్రీని కవిగా, రచయితగా, వ్యక్తిగా తెలుగు వారికి సమగ్రంగా పరిచయం చేసిన ఘనత కె వి ఆర్.దే. ఆయన కలం నుంచే శ్రీశ్రీ జీవిత సాహిత్యాల మీద సమగ్ర గ్రంథం వెలువడుతుందని ఆశించాము. కాని నెరవేర లేదు. శ్రీశ్రీ కవిత్వం గురించి 1950-1985 మధ్య కాలంలో రాసిన వ్యాసాల సమాహారమే జగన్నాధ రథచక్రాలు. శ్రీశ్రీ సాహిత్యం - మూడు సంపుటాలకు చక్కని పీఠికలు సమకూర్చాడు. ఆవ్యాసాలు కూడా జగన్నాధ రధ చక్రాల్లో వున్నాయి. చారిత్రక నేపధ్యంతో విషయాన్ని వివరించడం ఆయన ప్రత్యేకత. వివాదాల జోలికి పోకుండా విషయ వివరణ చేస్తే గొప్ప విమర్శకుడుగా రూపొందేవాడు. అంత మాత్రాన ఆయన రచనలు సమగ్ర సుందరాలు కాకుండా పోలేదు. మిగతా రచనలన్నీ వదిలేసినా దువ్వూరి రామిరెడ్డి మీద

రాసిన 'కవికోకిల', గురజాడ మీద రాసిన 'మహోదయం' చాలు ఆయన్ను గొప్ప విమర్శకుడుగా చెప్పుకోడానికి.

సాహిత్య విమర్శలో సామాజిక దృక్పథానికి ఇతోధిక ప్రాధాన్యాన్నిచ్చాడు గతితార్కిక దృష్టి మూలంగా పూర్వాపరాలను స్పృశించడం, ధోరణులను సూచించడం, పరిణామాన్ని నిర్వచించడంకె వి ఆర్‌కు అలవడిన వైఖరులు భావ ప్రకటనలో సాహసికత్వమనిపించగల నిర్భయత్వం, నిస్సంకోచత్వం, పదవిన్యాసంలో కటుత్వమనిపించగల పటుత్వం వీరి నైజానికీ, రచనా పద్ధతికీ ఆనవాళ్ళని 'కవికోకిల'లో రాశాడు. వ్యక్తి స్వీయనిబద్ధతను అతిక్రమించి వెలువడిన రచన 'కవికోకి' ల. రచయితదర్శనానికి అతని సంకుచిత పరిధిని విస్తరించే శక్తి వుందనడానికి నిదర్శనం కవికోకిల

రాజకీయ విషయాలను కావ్యవస్తువులుగా చేసుకుని కూడా

మానవుడే నా సంగీతం
మనుష్యుడే నా సందేశం

అన్నాడు శ్రీశ్రీ కె వి ఆర్ కూడా మానవుడే విజేత అన్నాడు

క్రిమి కాదు మనిషి
మహా సముద్రం శేముషి
సంకల్ప బలం మనిషి
మనిషంటేనే మనస్సు
మనిషంటేనే మహస్సు

మహాభారతం కూడా మానవుని కన్నా ఉన్నతమయింది లేదన్న సత్యం చెప్పింది మార్క్సిస్టులు రష్యా, చైనాల పురాణాలు చదువుతారు గాని మనవి చదవరు, మెచ్చరు దేశీయ సాహిత్యంలోని అభ్యుదయాంశాలు వారి కంటికి కనిపించవు.

గుహ్యం బ్రహ్మతద్ ఇదం వో బ్రవీమి
నమానుషచ్ శ్రేష్ఠతరంహి కించిత్.

శ్రీశ్రీ రచనల్లో తాత్వికాంశ ప్రబలి కవిత్వం పలచబడిందని గుర్తించాడు కె వి. ఆర్ హృదయం చల్లబడింది పక్షిరాజు అయిన వాడల్లా మట్టి పురుగవుతున్నాడు ఒక విషయాన్ని ఉజ్జ్వలంగా నిరూపించడంలోనే దానిప్రయోజనాన్ని స్థాపించినట్లౌతుందని భావించిన శ్రీశ్రీయే పనిగట్టుకుని ప్రబోధం చెయ్యబూనుకుంటున్నాడు. శ్రీశ్రీ కవిత్వంలో క్షైణ్యం ఎచ్చొచ్చింటే ఇందువల్లనేనని కె.వి.ఆర్. తీర్పు.

ప్రారంభదశలో శ్రీశ్రీని copyist అన్నారు నేను అప్పుడప్పుడు వ్యాసాలు, కవితలు రాస్తున్నప్పుడు నా గురించిరాస్తూ ' ఒక కాకి ముత్యాలన్నిటిని ఏరి కుప్పగా పోసి మురిసింది' అన్నారు. హంసను కావాలని నాతపన, తపస్సు. రచన ఒక ఆలంబన. మార్క్సిస్టు సాహిత్య

విమర్శకులకు మార్క్సిజమే శరణ్యమని, సర్వరోగనివారిణి అనుకోరాదని సారగ్రహణం చేయాలని చెప్పేవాడిని హోవార్డు ఫాస్టురాసిన The Naked God గ్రంథం పంపమంటే పంపాను అటువంటి అనుభవం నాకూ కలగాలని సమాధానం రాశాడు కె వి ఆర్ కాని కలగలేదు

వేమన్నను గురించి ఉపన్యాసాలిప్పించి గ్రంథంగా వెలుగులోకి తీసుకురావడానికి కారకుడు సి ఆర్ రెడ్డి వేమన మీద ఆనాటికి, ఈ నాటికి మంచి గ్రంథం రాళ్ళపల్లి వారిదే ననడంలో సందేహం లేదు రాళ్ళపల్లి సహృదయ విమర్శకుడు కె వి ఆర్ మాటలు చూడండి

''వేమన గురించిన సదవగాహనకు రాళ్ళపల్లి రాళ్ళ కట్టలాంటి వ్యాఖ్య, ఆయనది చాలా వరకు వెనకచూపే విస్సన్న చెప్పిందేవేదమైతే, రాళ్ళపల్లి చెప్పిందే సద్విమర్శ రాళ్ళపల్లి మెత్తనిపులి ''

వేమన మీదరాళ్ళపల్లి గ్రంధాన్ని మెచ్చకపోతే సరే వేమన మీద మంచి వ్యాసం కె వి ఆర్ రాయలేకపోయారు సామాజికాంశాలకు పరిమితమై రచన చేస్తే అది సమగ్రంకాదు తాత్వికాంశాలు మార్క్సిస్టులకు పడవు

కాసిరెర్, డ్యూయీ, పౌండు, ఇలియట్, సుసాన్ లాంగర్ వంటి పాశ్చాత్య సౌందర్య వాద తాత్వికులు తెలుగులో లేకపోవడం వల్ల కవిత్వం గురించిన విమర్శ తాత్వికమైన పటిష్టతను సంతరించుకోలేదు

ఎవరికిష్టమైన మూతుల్లో వారుండి వారి ఇజాలకు లొంగని కవిత్వాన్ని కటువుగా విమర్శించిన వారెక్కువ మార్క్సిస్టు విమర్శకులు అందరికన్నా ఘనులు 'ఆధునికాంధ్ర సాహిత్యచరిత్ర' (1992) పేరుతో చలసానిప్రసాద్, వేణుగోపాల్ సంపాదకులుగా కె వి. ఆర్ వ్యాసాలు వచ్చాయి. సాహిత్య చరిత్ర అనడం సాహసమని కె వి ఆర్ అన్నారు చరిత్ర అంటే ఎలా వుండాలో కె వి ఆర్ కే తెలుసు వ్యక్తుల కవిత్వం గురించి రాసిన వ్యాసాలకు చరిత్ర అని పేరు పెట్టడం బాగుండలేదు ఆంధ్రప్రభలో 'అక్షర జగత్తు' శీర్షికన కందుకూరి నుంచి నేటి వరకు కవుల కవిత్వాలను పరిచయం చేస్తూ రాశారు. కొడవటిగంటి కుటుంబరావు 'నవలా కుటుంబం' వ్యాసం భారతి ఫిబ్రవరి 1966 లో వచ్చింది కె వి. ఆర్. రాసిందేనా అనే అనుమానం కలిగించే శైలిలో రాశాడు. అభ్యుదయ సాహిత్యోద్యమం, విరసం పూర్వాపరాలు వంటి వ్యాసాలు చరిత్రకు బాగా ఉపయోగపడే రచనలు. స్వీయ రాజకీయ దృక్పధానికి అనుకూలురు కాని వారితో వివాదాస్పదంగా రాయడం పూర్తిగా రాజకీయ అరాచకం. మేధావుల్లో సంయమనం, ప్రశాంత మనస్సు, తెలియని వారికి తెలియచెప్పే నేర్పు, విషయ పరిజ్ఞానాన్ని కలిగించడం వంటి లక్షణాలుండాలి. ఒకే సిద్ధాంత నిబద్ధుడికి తాను వలచిందే ప్రియం గనుక దానికి ప్రతి కూలమయిన దాని యందు కోపం, అజ్ఞానం, అవివేకం పుట్టి బుద్ధి భ్రష్టమైపోతుంది. రమణారెడ్డి యిందుకు వెలిగాదు కె వి ఆర్. ఆవేశానికి బుద్ధికి మధ్య సమతూకాన్ని నిలుపుకోలేకపోయాడు బహుగ్రంధాలను పఠించాడు ఒక్కోసారి ఆపుకోలేని ఉన్మత్త భావస్థితి కనిపిస్తుంది తన వ్యష్టిని ఏ సమిష్టిలోనూ విలీనం చేసుకోలేడు. ఆధునిక శాస్త్రాభివృద్ధిని, భౌతిక సౌఖ్య సమృద్ధిని మనసారా ఆహ్వానిస్తూనే పామర జనరంజకమైన, ఆటవిక సంస్కృతికి దర్శనాలైన జానపద పాటల్ని, గంతులు చిందులు చిన్న పిల్లల్లా వేయడాన్ని,

పాటల మత్తులో జోగిపోవడాన్ని ప్రోత్సహించడం సమర్థించడం చికాకు కలిగిస్తుంది మాటకు ఆచరణకు సమన్వయాన్ని సాధించడం, పదుగురి భాషలో బోధించడం, మానవుల పట్ల అపారమైన ప్రేమను చూపడం వంటివి మార్క్సిస్టు సాహిత్య వేత్తకు వుండాల్సిన లక్షణాలు

ఒకసారి చల్లపల్లిలో అమరవీరుల సంస్మరణ సభలకు కె వి ఆర్ వచ్చారు. సభలకు వెళ్ళడం అంతగా అలవాటులేని నన్ను పిలిపించి వేరే పనులుండటం వలన ఉపన్యసించి వెళ్ళిపోతున్నానని చెప్పి వెళ్ళిపోయారు నాకు ఉత్తరాల ద్వారా పరిచయం సంవేదన మిమ్మల్ని కవ్విస్తుందని మీ తరపున చందా కడతానన్నారు. కవితలు - ప్రగతి వారపత్రిక విశాలాంధ్ర నుంచి వచ్చేవి - పత్రికకు వారే పంపారు. మేము భిన్న దృక్పథాలు కలవారం కావడం వల్ల చిన్న మనసు కావడం వలన ఎక్కువ కాలం రాసుకోలేకపోయాం అయితే వారు రాసిన పుస్తకాలు పంపారు చెరబండరాజు చల్లపల్లి వచ్చినపుడు కలుసుకుందామని వెళ్ళాను. చిరునవ్వు నవ్వి Yuppies తో కలిసి వెళ్ళిపోయాడు గాని మాట్లాడలేదు కార్మికుణ్ణి అయినా కె.వి ఆర్ అభిమానం అటువంటిది

''కవిననో, రచయితననో, బుద్ధి జీవిననో, మేధావిననో, నేనై నేనెన్నడూ డప్పుకోలేదు విమర్శకుణ్ణనీ, విజ్ఞానిననీ, తాత్వికుణ్ణనీ, క్రాంతి దర్శిననీ, ఋషిననీ నాకై నేనెవరి నుంచి హెచ్చూ మెచ్చూ కోరలేదు. యాచించలేదు, యోగ్య తాపత్రాలు అర్థించలేదు''' పంచరత్నాలు.

పై మాటలు చదువుతుంటే కె.వి.ఆర్. అంతరంగంలో తగిన గుర్తింపు రాలేదన్న నిరాశ వుండి వుంటుంది తిలక్‌ను గురించి కళాకేళిలో రాసినపుడు విమర్శిస్తే ఆయనకు బాధ కలిగింది మంచి కవిత్వమని తెలిసినా మార్క్సిస్టు అవగాహనతో తోసిపుచ్చాలి. అంతే, ఆయనకృషిని శంకించడం కాదు. మార్క్సిస్టుగా బయలుదేరాడు బయలుదేరిన చోటే ఆగిపోయాడు ఎదగనివ్వలేదు అంతటిపాండిత్యం సంపాదించాడు. పుంఖాను పుంఖంగా రచనలు చేస్తూ పోయాడు. వివాదాలను సృష్టించేవాడు. ప్రశాంత స్థితి లేదు. విరసంలో చేరి మరీ స్థిమితం లేకుండా చేసుకున్నాడు తాత్వికుడూ, ఋషీ కాలేకపోవడానికి కారణాలివే.

మార్క్సిస్టు కబంధ హస్తాల్లో ఖైదీ కావడం వల్ల బయటికి రాలేకపోయాడు కె వి.ఆర్. సాహిత్య విమర్శలో విలియం విమ్‌సెట్, క్లీన్త్ (బ్రూక్సు), ప్లెఖనోవ్, క్రిష్టఫర్ కాడ్వెల్, ఎడ్వర్డు విల్సన్, లూయీ పారింగ్టన్ కోవకు చెందిన వాడని ఎ.బి.కె. ఘనంగా నివాళులర్పించాడు.

కె.వి.ఆర్. మంచి రచనల్ని పదే పదే చదువుకునే అభిమానిగా, ఆయన్ను మార్క్సిస్టు దృక్పథం దేశానుగుణంగా మార్చుకుని రచనలు చేయాలని కోరుకునే వాణ్ణిగా పరిచయం చేసుకున్నవాణ్ణి నా అభిప్రాయంలో కవిగా సాహిత్య విమర్శకుడుగా, ఉద్యమ, రాజకీయ సాహితీవేత్తగా, మార్క్సిస్టు కవితా సిద్ధాంత ప్రచారకుడుగా కె.వి ఆర్. మరుపురాని మహామనీషి.

## సవరణ

ఫిబ్రవరి '98, మిసిమి సంచిక రెండో అట్ట మీది బొమ్మక్రింద మహమ్మద్ కులీకుతుబ్‌షాకు బదులు ''అబ్దుల్లా కుతుబ్‌షా''గా చదువు కోవాలని మనవి.

# Form IV (SEE RULE 8)

## Statement about ownership and other Particualrs of MISIMI

| | | |
|---|---|---|
| 1 Place of Publication | : | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R T.C Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020. A.P. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | ALAPATI BAPANNA |
| Whether citizen of India | : | Yes |
| If foreigners, state the country of origin | : | |
| Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R T.C Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020. A.P |
| 4. Publisher's Name | : | ALAPATI BAPANNA |
| Whether citizen of India | | |
| If foreigners, state the country of origin | | |
| Address | | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R.T.C. Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020. A.P. |
| 5. Editor's Name | : | ANNAPA REDDY<br>VENKATESWARA REDDY |
| Whether citizen of India | : | Yes |
| If foreigners, state the country of origin | | |
| Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R.T.C. Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020. A.P |
| 6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital | : | ALAPATI BAPANNA<br>337-A, Road No. 10,<br>Jubilee Hills,<br>Hyderabad - 500 034. |

I, ALAPATI BAPANNA, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-
**ALAPATI BAPANNA**
Published

Date : March 1, 1998.